

తల్లి ప్రేమ

ఫొటో: వి. తంబి—కర్నూలు.

# ఆమె సౌందర్యవతి...
# ఆమె పాండ్స్‌ను ఉపయోగిస్తుంది



మీ ముఖమును మృదువుగా మరియు
మనోహరముగా ఉంచుకొనుటకు




## పాండ్స్

వ్యానిషింగ్ క్రీమ్‌ను వాడండి

తేలికైన మరియు మంచువలెనున్న పాండ్స్ వ్యానిషింగ్ క్రీము చర్మమునకు రక్షణనిచ్చి దానిని చక్కగా మరియు మనోహరముగా ఉంచుతుంది. అది జిగురుగా ఉండదు మరియు రాసుకొన్న మరుక్షణములోనే కనపడకుండాపోతుంది. పాండ్స్ వ్యానిషింగ్ క్రీమును పౌడరును అద్దుకొనే ముందు వాడితే పౌడరును గంటలతరబడి అంటుకొని ఉండేలా ఉంచుతుంది.

చర్మమును శుభ్రపరచే క్రీమ్: ప్రతి రాత్రి మీ ముఖమునకు పాండ్స్ కోల్డ్ క్రీమును రుద్ది రాసుకోండి. అది చర్మమును శుభ్రపరుస్తుంది మరియు మీ లావణ్యమును కాపాడుతుంది.

చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపించబడినది)

సంవత్సర చందా
రు. 13-0-0
విడిప్రతిక 25న.పై

# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక

సంపుటము 53
సంచిక 33
20 5-59

Founder : K. NAGESWARA RAO

వికారి వైశాఖ శుద్ధ త్రయోదశి బుధవారం



## విషయానుక్రమణిక

ముఖచిత్రం:
విశ్వరూపా వారి
"కూతురుకాపురం"లో
సూర్యకళ



# రాజధాని కబుర్లు

ప్రవీణ్

## ఆర్యవైశ్య మహాసభలు

'మమత' అనేది దేశంలోని అన్ని కల్లోలాలకు కారణం. మనిషి మనిషిగా జీవించడానికి, తన పెళ్ళాం బిడ్డలు కొరకు, తన సంసారంకొరకు చేసే పను లన్నీ భగవత్సంబంధ దృష్ట్యా చేస్తే, ఈ సంసార సాగరం నుంచే మోక్షంపొందే అవకాశం ఉంది. ఇదే గీతా సారం; భగవన్మతం.'

సీతారాం బాగ్ లో గతవారం జరిగిన అఖిలభారత శ్రీ వైష్ణవ మహాసభలకు అధ్యక్షత వహించిన శ్రీమన్నారాయణ జియ్యర్ స్వామి పలుకులివి.. దాదాపు. ఇవి నాకు పూర్తిగా అర్థమయ్యాయని చెప్పలేను. అర్థమయినంతవరకు బాగున్నట్టు కనపడ్డాయి.

'నేను' అనే వ్యవస్థ ఉంది చూశారూ? అది చాలా ప్రమాద కరమైన వ్యవస్థ. 'నా' చుట్టూ నా కులం అలుముకొని ఉంది. నా గ్రామం వ్యాపించి ఉంది. నాకు నా పైగల మమకారం సహజంగా నా కులంపైకి, నా గ్రామంపైకి వ్యాపించింది. ఈ మమకారం విస్తృతమై నా మతంపైకి, నా దేశంపైకి పోయింది.

మహాత్మాగాంధి మనకు కొన్ని విషయాలు తెలిపారు. ఆయన బ్రతికి ఉన్నంతకాలం ఆయనకు ఆయన పలుకులపై ప్రత్యేకమైన మమకారం లేదు. ఆయన బ్రతికి ఉన్నంతకాలం, తన భావాలను, అభిప్రాయాలను ఆయన పరిస్థితులకు అనుగుణంగా సరిదిద్దుకొనే వారు మరణించిన బాపూజీ పలుకులను వల్లెవేసి ప్రాణాలు తీసు న్నారు నేటి 'ఛోటా' సంఘ సంస్కర్తలు.

కులాలపై మమకారం కులాలపై ద్వేషంగా పరిణమించడం దోషం. స్వస్థలాలపై మమకారం ఇతరస్థలాలపై ద్వేషంగా పరిణమించడం తప్పు. ప్రేమ అన్నది పరిమితమైనా ప్రోత్సహించ తగ్గదే. నేను నాకు గలట్టి సంపత్తిని, జ్ఞానాన్ని నాకులస్థులను, నా గ్రామస్థులను బాగుచేయడానికి వినియోగిస్తానంటే అది దోషంకాదు. నాకులం, నా స్థలం నా దేశంలో భాగాలు. నాకులం మనుష్యులు, నా స్థలం మనుష్యులు జీవకోటిలో భాగాలు. నాకు నా వారిపైగల ప్రేమ నీ వారిపై ద్వేషంగా పరిణమిస్తే, సిద్ధాంతాలు వికరువుపెట్టు, ఇది తప్పు అని వేలెట్టిచూపించు.

*　　*　　*　　*

గత వారం సికిందరాబాదులోని మహబూబ్ కాలేజి హైస్కూల్ ఆవరణలో తృతీయాంధ్ర ప్రదేశ్ ఆర్యవైశ్య మహా సభలు జరిగాయి. రాష్ట్రమంతటినుంచి వందలకొలది వైశ్యులు ప్రతినిధులుగా వచ్చారు. మహాసభలలో కొందరు ప్రముఖుల ఉప న్యాసాలలో కులం ప్రాతిపదికగా మహాసభలు జరపడం న్యాయం కాదేమో అన్న సందేహం వ్యక్తపరచబడింది. చూడవచ్చిన వైశ్యేతర ప్రముఖులు కొందరు ఇదే సందేహం వెలిబుచ్చారు.

వైశ్య మహాసభలు ఇతర కులాలకు నష్టం కలుగచేయాలనే దృక్పథం వెలిబుచ్చనంతకాలం ఈ సందేహం రావడానికి తావు ఉందని నేను భావించలేను.

ఆర్యవైశ్య మహాసభలలో వెలిబుచ్చిన అభిప్రాయాలు కొన్ని గమనించతగ్గవి ఉన్నాయి. వైశ్యులెంతకాదు పొమ్మన్నా, ఆ కులం వారిలో ధనికులు అధికులున్నారు. తాతముత్తాతలు స్థాపించిన వ్యాపారాన్ని అంటిపెట్టుకొనిఉండి, నష్టంరాకుండా విపరీతమైన ఆ రాకుండా తెలుసుపోతారు వీరులలో సామాన్యులు.

చదువుకొనడం ఉద్యోగం సంపాదించుకోడానికే అన్న అభి ప్రాయం ప్రబలంగా ఉండికనక, ఉద్యోగంపై వారికి ఆశలేదు కనుక చాలమంది పెద్దచదువులకిపోరు. విద్యాసాంఘిక రంగాలలో తాము వెనుకబడిఉన్నామనే జ్ఞానం, ఆ రంగాలలో పురోగమించా లనే ఆకాంక్ష గత వారం సమావేశాలకు హాజరైన ప్రతినిధులలో కనుపించింది. ఇది మెచ్చుకోతగిన విశేషం.

'సామ్యవాద సరళి సమాజం' అంటూ ఏనాడు ఆవడిలో ఒర వడి పెట్టుకుందో కాని కాంగ్రెసు, ప్రజల వ్యక్తిగత జీవితంలో అధి కంగా జోక్యం చేసుకోడం ప్రారంభించింది ప్రభుత్వం. సామ్య వాదం అదృశ్యమైంది; మిగిలింది దైనందిన జీవితంలో ప్రభుత్వ జోక్యం మాత్రమే. డబ్బు సంపాదిస్తే పన్ను, ఖర్చుపెడితే పన్ను, దానమిస్తే పన్ను, బాధపడలేక చచ్చిపోతే పన్ను అన్నట్టుంది ఇప్పటి పద్ధతి. ఈ పద్ధతిపై వ్యతిరేకాభిప్రాయం స్త్రీ ప్రతినిధు లలో కూడా కనపడడం మొన్న ఆర్యవైశ్య మహాసభలలో గమనించ తగ్గ మరో విషయం.

కులం ప్రాతిపదికపై ఏర్పడిన ఈ సమావేశాలలో ఆర్థిక పరిస్థితులు ప్రధానంగా చర్చించబడడం మెచ్చుకోతగిన అంశం.

ఇవి మెచ్చుకోదగిన అంశాలేఅయినా, మెచ్చుకోలేని అంశాలు ఒకటి రెండు ఉన్నాయి. 'చీకటిబజారు' ఎక్కువగా వర్తకుల లోనే ఉంది అన్న ఆరోపణకు సమాధానంగా వక్తలు మిగిలిన వర్గాల్లో లేదా అని ప్రతిప్రశ్న వేశారు. వర్తకులను అనడం వైశ్యు లను అనడమే అన్న భావన దీనికిమూలం. అదేవక్తలు మరో సంద



ప్రసిద్ధ జర్మన్ చిత్రకారిణి కెథె కోల్విజ్ యుద్ధోన్మాదాన్ని గర్హిస్తూ రచించిన 50 చిత్రాలను, దక్షిణ భారత చిత్రకారుల సమితివారు మే తొలివారం, మద్రాసు, సెంటినరీ ఎగ్జిబిషన్ హాలులో ప్రదర్శించారు. నగరంలోని కళాప్రియులు, చిత్రకారులు పలువురు చూచి విశేషంగా ప్రశంసించారు. 'ఆవేదన' అనే ఈ చిత్రం వాటిలో ఒకటి.

#  రాజధాని కబుర్లు 

ర్భంలో ప్రసంగిస్తూ 'వ్యాపారం వైశ్యులే కాదు చేస్తున్నది, ప్రధాన పరిశ్రమలన్నీ ప్రభుత్వం కైవసం చేసుకొంది. మిగిలిన వాటిలో ముఖ్యమైనవి ఇతరకులాలవారి చేతుల్లో ఉన్నాయి' అని మొరపెట్టుకున్నారు. ఇది వారి ఆలోచనల్లో అస్పష్టతకి చిహ్నం. మిగిలిన వర్గాలు అవినీతికి పాల్పడడం, వర్తకులు అవినీతికి పాల్పడడాన్ని సమర్థించదు. నేరం ఎవరుచేసినా నేరమే. వైశ్యేతరులు అధికంగా వ్యాపారంచేస్తున్నప్పుడు, వర్తకులపై నింద వైశ్యులపై నిందగా భావించడంకూడా పొరపాటే.

'చీకటిబజారు' లేదని వారూ అనలేదు. దాన్ని అంతంచేయడానికి వారే సూచనలుచేస్తే బాగుండేది. ఈ లోపం చతుర్థాంధ్ర ప్రదేశ్ ఆర్యవైశ్యమహాసభలు తీరుస్తాయని ఆశిద్దాం.

## శ్రీ వైష్ణవమహాసభలు

**పూర్వం లాటిన్‌లో మాటాడితేగాని, వినేవాడు కాదుట పాశ్చాత్యుల భగవంతుడు. మనకి దేవభాష సంస్కృతం. అందులోనే ప్రార్థించేవారు దేవుణ్ణి. మత గ్రంథాలన్నీ సంస్కృతంలోనే ఉండేవి, సర్వజ్ఞుడు భగవంతుడికి అన్నిభాషలు అర్థమవుతాయి. మనకర్థమయ్యే భాషలో మతగ్రంథాలుండడం మంచిది కాదూ ?**

ఈ విషయంచదివితే బహుశః మన విద్యామంత్రి అంగీకరించరేమో! చిన్న చిన్న గ్రంథాలన్నీ తెలుగులో ఉన్నా, పెద్దవన్నీ—ప్రస్తుతం మనదేశభాష—ఇంగ్లీషులోనే ఉండాలంటారేమో!

శ్రీవైష్ణవ మతగ్రంథాలన్నీ ప్రస్తుతం సంస్కృత ద్రావిడాది భాషలలో ఉన్నాయి. శ్రీవైష్ణవులుకాని, తదితరులుకాని ఈ సిద్ధాంతసారాన్ని గ్రహించి ఆనందించాలంటే, ఈ గ్రంథాలు తెలుగు భాషలోకి అనువదించబడాలి. ఇదే విషయం శ్రీవైష్ణవ మహాసభలో పాల్గొన్న శ్రీ వై. ఎల్. నరసింహాచార్యులు పేర్కొన్నారు.

శ్రీవైష్ణవ మతం హిందూ మతంలో ఒకభాగం. భగవంతుణ్ణి చేరడానికి బాటలెన్నో ఉన్నాయి. అందులో ఇదొకటి. ఈ విషయం గుర్తించి, పరమత సహనాన్ని చాటారు సభలో చాలమంది. ఇది ముదావహమైన విషయం.

సంకుచితమైన భావాలను విడనాడి ఆలోచించినప్పుడు, ఆలోచనలన్నీ సూటిగానే పోతాయి. ఎవరు ఎటు ప్రారంభించి ఏదిశకి పయనించినా, లక్ష్యం ఒక్కటే.

## ఒకరు కాదు, ఇద్దరు కాదు....

**ఒకరు కాదు, ఇద్దరుకాదు పదిమంది ప్రాణాలను తీసిన లింగడు అనే వ్యక్తి గతవారం నగర పోలీసుశాఖకు వశుడయ్యాడు. పగ సాధించడానికి ప్రాణాలు తీసిన వాళ్ళున్నారు. లక్షల రూపాయల ఆస్తులకోసం హత్యలకు ఒడిగట్టుకున్న వారున్నారు. లింగడికి రెండు మూడు తులాల వెండిచాలుట నిండుప్రాణం తీయడానికి.**

పోలీసుశాఖ కథనం ప్రకారం గత మార్చినెలలో లింగడు జాంబాగ్‌లోని ఒక చాకలివాని ఇంట్లో ప్రవేశించాడు. తలుపుతట్టి తాను 'హకీమ్'నని, మంత్రగాడినని చెప్పుకున్నాడు. ఎటువంటి వ్యాధికైనా మందులిచ్చి కుదురుస్తానన్నాడు. ఇంటి యజమాని తల్లి భాసమ్మ అనే ఏభైఐదు సంవత్సరాల స్త్రీ తలనొప్పి అంటే వెంటనే మాత్రలు సంచిలోనుండి తీసిఇచ్చాడు. యజమానికి, భార్యకి, అతని తమ్ముడికి కొన్ని మాత్రలిచ్చాడు. వాళ్ళవి ఉపయోగించలేదు.

మాత్రలు వేసుకున్న వెనువెంటనే భాసమ్మ స్పృహతప్పి పడిపోయింది. ఆసుపత్రిలో చేర్చబడింది కాని కొద్ది నిముషాల్లోనే మరణించింది. లింగడు అదృశ్యుడయ్యాడు.

సమాచారం అందిన వెనువెంటనే పోలీసుశాఖ నేరాన్వేషణ విభాగం అసిస్టెంటు కమీషనర్ శ్రీ హనుమంతరావు నాయుడు సూచనల ప్రకారం వేట ప్రారంభమైంది. లింగడు పట్టుబడ్డాడు.

లింగడు హైదరాబాదు, మహబూబ్ నగర్, నల్గొండ జిల్లాల్లో ఈ విధంగా మందులు మాత్రలిచ్చి, మంత్రాలేసి పదిమందిని పొట్ట పెట్టుకున్నాట్ట. కాపు కులానికి చెందినవారు వెండినగలు సాధారణంగా ధరిస్తారు కనుక మత్తుపెట్టి మందులిచ్చి హత్యచేసి నగలు కొనిపోవడం అతని ప్రత్యేకతట!

## హృదయం లేని బస్సు

**మనుష్యులకే హృదయం లేని ఈ రోజుల్లో బస్సులకి ఉంటుందని భావించటం పొరపాటు. అందులో ఆర్. టి. సి. బస్సులకి. కాని మనకి హృదయాలు ఉన్నాయి కనుక తలుచుకుబాధ పడక తప్పదుమనం..**

గత ఆదివారం రాత్రి తొమ్మిది గంటల సమయంలో 1468 నెం. బస్సు సికిందరాబాదునుంచి సీతాఫల్ మండీ మీదుగా అఫ్జల్ గంజ్ బయలుదేరింది. బోర్డు చెప్పింది బస్సు అఫ్జల్ గంజ్ పోతుందని. కండక్టరు టికెట్ అఫ్జల్ గంజ్‌కి ఇచ్చాడు. చాదర్ ఘాట్ వంతెనవరకు బస్సు పోయేసరికి కండక్టర్ కి ఏమిబుద్ధి పుట్టిందో ఆడాళ్ళని మగాళ్ళని అక్కడ దిగి పొమ్మన్నాడు. టికెట్ అంతవరకు ఇచ్చావు కదా అంటే, 'రూల్సన్నీ నాకు తెలియదు. కావాలంటే డబ్బులు వాపస్ ఇచ్చేస్తా' అన్నాడు.

కండక్టర్లు హృదయంలేకుండా ప్రవర్తించడం ఇది మొదటి సారి కాదుకాని ఈ విధంగా రూల్సుకు వ్యతిరేకంగా నిర్లక్ష్యంగా ప్రవర్తించడం ఇదే మొదటిసారి. ఆర్. టి. సి. సంస్థ ఏం చేస్తుందో చూడాలి మరి. ★

## జీవితబీమా వ్యాపారం పెరుగుదల

ఈ సంవత్సరం మొదటి నాలుగు నెలలలోనూ జీవితభీమా కార్పొరేషనువారు. 48.78 కోట్ల విలువగల కొత్త వ్యాపారం పూర్తిచేసింది. 1958 సం|| మొదటి నాలుగు నెలలలోకంటె ఇది రూ. 8.88 కోట్లు ఎక్కువ. ఈ వ్యవధిలోనే ప్రవేశపెట్టిన వ్యాపారంలోకూడా రూ. 20.12 కోట్ల పెరుగుదల కనిపించింది.

ఆయా జోనులలో అన్నిటా ప్రతిపాదించబడిన వ్యాపారం పెరిగింది. పడమటి జోనులో అన్నిటికంటె ఎక్కువ. ప్రతిపాదించిన వ్యాపారమే రూ. 21.72 కోట్లుంది. దక్షిణపు జోనులో ప్రవేశపెట్టిన వ్యాపారం రూ. 21.48 కోట్లలో రూ. 18.02 కోట్ల వ్యాపారం పూర్తయింది.

ఇక పాలిసీలు. 1958 మొదటి నాలుగు నెలల్లో 1,82,406 పాలిసీలు ఇవ్వబడితే, 1959 లో ఏప్రిల్ ఆఖరివరకూ 1,47,519 పాలిసీలు ఇవ్వబడినవి. ★

# ఆరుద్ర • గళ్ళనుడికట్టు

మాటల్లోంచి మంటలూ, పువ్వులూ పుట్టించటానికి వీలుందని మొదట కని పెట్టినవాళ్ళు కవులు. "వాగర్థా వివసం పృక్తౌ..." అన్నాడొక మనీషి. మాటని మాటతో ఢీ కొడితే ఇంకో మాటకాక, నక్షత్రం పుడుతుందన్నాడొక ఇంగ్లీషు కవి. మామూలుగా మాటలాడటానికీ, మాటలతో ఆడుకోటానికీ ఉన్న తేడాతో ఎన్ని గమ్మత్తులనా చేయవచ్చు. గళ్ల నుడి కట్టులు (పజిల్స్) ఇలాంటి గమ్మత్తుల్లో ముఖ్యమైనవి. వీటిని ఎదురుగా పెట్టకుని మనకెంత పలుకుబడి ఉందో ఎవరికి వాళ్ళం పరీక్షించుకోవచ్చు. పదవిక్షేపంచేసి కాలక్షేపం చేయచ్చు. సమస్యని సాధించామని సంతోషించవచ్చు. వీటిలోని చమత్కారం చక్కిలి గింతలు పెడుతుంది. ఆధునిక కవి ఆరుద్ర కట్టిన ఈ గళ్ల నుడికట్టులు వారం వారం ప్రకటిస్తాము. ఈ వారం నుడికట్టుకు పై వారం జవాబులు.

(ఉదాహరణగా రెండు సమాధానాలు చూడండి: 1 అడ్డం:—పై పెచ్చు. 2 నిలువు:—పైకము. ఈ పద్ధతిలో నుడి కట్టును విడగొట్టుకుంటూ పోవాలి.)



## ఆధారాలు

### అడ్డం

1. లోనున్న గుజ్జుకాదు, పైగా, మీదనున్న పెళ్ళ!
3. చేను కాలు తీసుకొంటే మధ్య నడుము తిరుగుతుంది.
4. పొట్టి చిరంజీవితో కొన మొదలవుతుంది.
6. తిరగేసినా మరగేసినా సంతోషమే.
8. సతతము మొదలైంది కాని పూర్తికాలేదు.
9. తలకిందులైన కక్షిదారుడు దివాలాతీయడం ప్రారంభిస్తాడు.
11. 1 నిలువుతో కొండమీదనుంచి దీన్ని దింపవచ్చు.
13. చల్లగా చెప్పవలసిన మాటా?
15. లోహంతో చేసిన రవిక అనిపించవచ్చు గాని కనకంలా మ్రోగునా?
17. దినదినగండంలో ఇది పారుతుంది.
18. సాదావాదు కాదు 9 అడ్డం వేసేది.
20. ఇది చాపితే ఎప్పుడైనా మూరెడుకన్నా ఎక్కువే!
21. ప్రార్థన: మనకు సంబంధించినవే!
23. బాకు ములుకు తగిలితే మధ్యన బాధపడడం.
24. ద్రవ్యం యావత్తూ పోగా నీళ్ళుకారుతుంది.
25. నయం; తళతళ లాడడం, ఇదికూడా చెప్పాలా?

### నిలువు

1. లోకముపై తలకొట్టి తారుమారుచేస్తే ధనలాభం.
2. ఈ శిక్షవేస్తే లోటు కనబడుతుంది.
3. చివర వృద్ధాప్యమున్న వెన్నెల.
5. మొదట వసపోస్తే లభించే చోటు కాబోలు.
7. తలలేని ఆధరువులా స్ఫురించే తాళం.
10. వికారమున్నా లేకపోయినా చర్చ!
11. పాగా వేయవలసిన సురక్షిత ప్రదేశం.
12. కారాకిల్లీలో రక్షించేదా?
13. తక్కువైందా? పాంచాలదాతలుగు స్తంగా వేసే ప్రశ్న.
14. అమాయకులు ఇటువంటి టోపీలో పడతారు.
15. నవధాన్యాలలో ఒకరకందినుసు. చేనుమీద అర్థమవుతుంది.
16. తన కష్టాలలో మొదటే తికమకపడ్డ కారణం.
17. నాలుకకు లేనిదీ, సంస్కృతం 11 అడ్డంలో ఉండేది.
19. స్తవం చివరనుంటే, నిజం పూర్తవుతుంది.
20. దిల్‌రుబా కులుకులో ఆయుధాలున్నాయి జాగ్రత్త!
22. కవిసుగుణాలలో చికాకొకటి!

# ఇల్లు కాదు.. ఇల్లాలు

## కొండముది హనుమంతరావు

ప్రీయూనివర్సిటీ క్లాసుకు ఫిజిక్సుపాఠం చెప్పి మేడ దిగి వస్తున్న ప్రభాకరానికి మేడమెట్లదగ్గర మూర్తి కన్పించి ఒక కవరు అందించాడు. వెయిటింగ్ రూమ్‌లో కూర్చుని కవరుచించి చదువుకున్నాడు ప్రభాకరం.

అది అతని తండ్రి రామనాథంగారు వ్రాసిన ఉత్తరం.

ప్రభాకరం ఇంటర్మీడియటుదాకా ఇంటి దగ్గరే ఉండి చదువుకున్నాడు. ఆనర్సు, యమ్. యస్సీ.కి మాత్రం యూనివర్సిటీ హాస్టల్సులో ఉన్నాడు. గుంటూరువదిలి వాల్తేరు వెళ్తున్నప్పుడు ప్రభాకరం అమ్మ, బామ్మ ఎంతో దిగులుపడ్డారు. వాల్తేరునీళ్ళు పడ్తాయో, పడవో.. హాస్టలు భోజనం సరిపడుతుందో లేదో అని చాలా భయపడ్డారు. కాని ప్రభాకరానికి వాల్తేరు నీళ్ళూ, భోజనమూ సరిపడ్డాయి.

ఆనర్సు చదువుతూండగానే ప్రభాకరానికి ఎన్నో సంబంధాలు రావటం మొదలెట్టాయి. కాని ప్రభాకరం గట్టిగా చెప్పేశాడు తండ్రికి—యమ్. యస్సీ. అయితేగాని చేసుకోనని. "సరే! నీ ఇష్టం" అన్నారు రామనాథంగారు.

యమ్. యస్సీ. ఫస్టుక్లాసులో ప్యాసయినాడు.

"ఇప్పుడయినా చేసుకుంటావా?" అని అడిగారు రామనాథంగారు.

"ఏదయినా ఉద్యోగం రానీయండి—చేసుకుంటాను."

"ఉద్యోగానికేముంది? కాలేజీలు తెరిస్తే ఎక్కడో ఒకచోట దొరక్కపోతుందా?"

"అయితే పెళ్ళేనంటారు సులభంగా కానిది?"

"అవున్రా నాయనా! పెళ్ళంటే మాటలా? మంచి సంప్రదాయం.. అందచందాలు, చదువుసంధ్యలూ ఉన్న పిల్ల దొరకటం తేలికనుకున్నావా? రంగనాథంగారి అమ్మాయిని చూసిరా. బాగా కట్నం కూడా ఇస్తారు," అని బామ్మ అందుకుంది.

కాని ప్రభాకరం ఆమెమాట విన్పించుకోలేదు.

పోస్ట్‌గ్రాడ్యుయేటుకు రెండువందల రూపాయల ఉద్యోగం రాకపోతుందా అని పెళ్ళిచేసుకున్న భాస్కరం ఏడాదినుంచీ నిరుద్యోగ బాధతోపాటు—అటు మామగారు భార్యను తీసికెళ్ళమని తొందరపెడూ వ్రాసే ఉత్తరాలకు జవాబులు వ్రాయలేక పడుతూన్న అగచాట్లూ...ఏదో నూటయాభై రూపాయలు వస్తున్నాయిగదా అని భార్యతో కాపురంపెట్టిన కామేశం నిత్యావసరాలకూ, మందులూ, మాకులకూ వచ్చే జీతం చాలక నానాగడ్డి తినటం—చూస్తున్న ప్రభాకరం కనీసం మూడువందల రూపాయల ఉద్యోగమయినా వస్తేగాని పెళ్ళి చేసుకోకూడదని నిశ్చయించుకున్నాడు.

ఎండాకాలం సెలవలయిపోయి కాలేజీలు తెరవగానే ప్రభాకరానికి బెజవాడలో లెక్చరరు ఉద్యోగం దొరికింది.

బెజవాడ వెళ్ళిన నెలరోజులకి ఇంటికి వచ్చిన ప్రభాకరాన్ని చూసి బామ్మ గుండెలు బాదుకుంది

"చిక్కి శల్యమయిపోయావు. నీకా హోటలుతిండి సరిపడలేదు. మంచిఇల్లు ఒకటి చూడు. నేనువచ్చి అన్నం వండి పెడతాను:"

ప్రభాకరం ఒప్పుకున్నాడు – హోటలు భోజనం బాగుండక ఆరోగ్యం సరిగా వుండటంలేదు.

"అలాగే చూస్తాను" అని బెజవాడ వచ్చేశాడు.

అప్పటినుంచి వారానికోసారి రామనాథంగారు ఉత్తరం వ్రాస్తుంటారు. 'ఇల్లు దొరికిందా' అని. దానికి జవాబుగా ప్రభాకరం "ఇంకా లేదు," అని మరునాడు వ్రాస్తూ ఉంటాడు.

కాని ఈసారి రామనాథంగారు. "నువ్వసలు ప్రయత్నిస్తూన్నట్లు లేదు· లేకపోతే నెలరోజులనుంచీ వెతుకుతుంటే ఒక్క ఇల్లయినా దొరక్కపోతుందా? నీకు సాధ్యం కాదంటే నేను వచ్చిచూస్తాను ఏ మాటా వెంటనే వ్రాయవలసినది.." అంటూ వ్రాశారు.

రామనాథంగారన్నదాంట్లో కొంతనిజం లేకపోలేదు. ప్రభాకరం మొదట్లో ఊరు తెలిసిన మూర్తిని జంటబెట్టుకుని నాలుగు రోజులు ఇంటికోసం వెతికాడు.

ఒక ఇంటాయన కులగోత్రాలడిగాడు. చెప్పాడు ప్రభాకరం. పెళ్ళి అయిందా – అని అడిగితే 'కాలేదు' అన్నాడు – అనుభవశూన్యుడయిన ప్రభాకరం. ఒక్కసారి ఆయన మొహంలో అసంతృప్తి గోచరించింది. అది గమనించినమూర్తి "పెళ్ళికాలేదుకాని.. అయినట్లేనండి" అన్నాడు.

"అంటే!" ఆయన క్వశ్చన్ మార్కు మొహం పెట్టాడు.

"అదేమిటి?" అన్నట్లు ప్రభాకరం మూర్తి వంక చూశాడు. మూర్తి "అది అంతేలే! మాట్లాడకు" అన్నట్లు కన్ను కలిపాడు. వేయి అబద్ధాలాడయినా ఒక పెళ్ళిచేయమన్నట్లు, ఒక పచ్చిఅబద్ధమాడి ఇల్లు చూసిపెట్టామనుకుంటున్నాడు కాబోలు మూర్తి అనుకుని ప్రభాకరం ఊరుకున్నాడు.

"మేనరికం ఉందండి. రేపు మాఘమాసంలో చేసుకుంటాడు. ఈలోగా వాళ్ళ బామ్మవస్తుంది."

"అల్లాగా!" అంటూ అయన తృప్తిగా నవ్వి ఇంటి తాళంతీశాడు.

వంటగది అనబడే ఒక చీకటి కొట్టు, వెలుతురూ-గాలీ అంటువ్యాధులు అన్నట్లు వాటి సంబంధమూ, సంపర్కమూ ఏమాత్రం లేని రెండు చిన్నగదులు – వెరసి నలభై రూపాయలు చెప్పాడు. పైగా బాత్‌రూమ్ లేదు; ఒకటే లెట్రిన్.

ప్రభాకరానికి ఆ ఇల్లేమాత్రం నచ్చలేదు.

"ఏమంటావోయ్!" అన్నాడు మూర్తి వెలుపలికి వచ్చాక.

"ఎలా గోయ్. ఆ ఇంట్లో ఉండటం! బాత్‌రూమ్ లేకపోతె మానె ఇవతలే నీళ్ళు పోసుకోవచ్చు. కాని గాలీ వెలుతురూ లేకుండా ఎలా ఉండటం?"

"ఫానూ, లైటూ వేసుకుంటేసరి!"

"మహానుభావా! అరవై నాలుగు కృత్రిమ సౌకర్యాల మధ్య ఉండటమంటే తలనొప్పినాకు."

ఆ మరునాడు ఇంకో ఇంటికి తీసికెళ్లాడు మూర్తి,

మేడమీద భాగం. విశాలమైన వంటగది. వంట సామగ్రి పెట్టుకునేందుకు మూడు అల్మారాలు పొగపోయేందుకు చిమ్నీ గాలీ వెలుతురు వచ్చేందుకు వెంటిలేటర్లు మూడు గదులు విడివిడిగా. ముందుగది డ్రాయింగ్ రూమ్‌గా ఉపయోగించుకోవచ్చును.

మరొకటి స్టడీరూమ్‌గా మార్చుకోవచ్చును. బాత్ రూము, లెట్రిన్లూ పైనే ఉన్నాయి.

ప్రభాకరానికి ప్రాణంలేచి వచ్చింది.

"అద్దెంతో అడిగావోయ్!" అన్నాడు మెల్లగా మూర్తితో.

"మొన్నటిదాకా రేడియో ఇంజనీరు గారుండిపోయారు. వాళ్ళు వందరూపాయ లిచ్చేవాళ్ళు."

ప్రభాకరానికి గుండెలాగినంత పనయింది మూర్తి ఏమాత్రం ఆశ్చర్యపడలేదు. మారు మాట్లాడకుండా దిగి వచ్చారు ఇద్దరూ.

"అలాగుడ్లు తేలేసే వేమోయ్?" రోడ్డు మీదికి వచ్చాక అడిగాడు మూర్తి.

"ఇంకా నయం. గుండెలాగలేదు. అందుకు సంతోషించు. వందరూపాయలే?"

మరేమిటనుకున్నావ్? అవ్వా కావాలి, బువ్వా కావాలి అంటే ఎలా? గాలీ, వెలుతురు అన్ని సౌకర్యాలు ఉన్నాయిగా, తీసుకో. పోతే పోయినయ్ వందరూపాయలు.

"ఇంటికి వందరూపాయలు పెట్టే మిగిలిన ఎనభై నాలుగు రూపాయిలతో ఎలా కాపురం వెలగబెట్టటం."

"ఇంటి దగ్గఱనుంచి నెల నెల ఒకవంద తెప్పించుకుంటూ ఉండు."

"ఏడ్చినట్లే ఉంది నీ సలహా;"

ఇక ఇంటికోసం ప్రయత్నించలేదు ప్రభాకరం.

ఇప్పుడు తనుంటున్న రూమే మంచిదను కున్నాడు మేడమీద విశాలమైన ఒకే ఒకగది. క్యాంప్ కాటు, ఈజీ చెయిర్, మూడు పేము కుర్చీలు వేయగా ఎంతో ఖాళీ ఉంది. ముందు బాల్కనీ ఉంది. పక్కనే ఓపెన్ స్పేస్ ఉంది. అద్దె ముప్పై అయిదు ఇస్తున్నాడు.

ఇంటివాళ్ళు క్రింద ఉంటున్నారు. చాలా మర్యాదస్తులు. రేడియో పెట్టుకుంటేను, ఏదయినా వ్రాసుకుంటూ రాత్రి పదకొండు, పన్నెండుగంటలదాకా లైటు వేసి ఉంచితేను ఏ ఇబ్బందీ లేదు... ఏ అభ్యంతరం కాదు.

తను చేరని ముందు ఈ రూములో ఎంతో మంది ఉంటూ వచ్చారు. ఒకళ్ళు నెలరోజుల కన్నా ఎక్కువ ఉండలేకపోయారు. అందుకు కారణం లేకపోలేదు.

మేడకు అటు ఇటు ఉన్న ఇళ్ళలో కాలేజీలో చదువుకొనే అమ్మాయి లున్నారు. ఈగదిలో చేరినవాళ్ళ చూపులు ఎప్పుడు ఆ అమ్మాయిల మీదే ఉండేవి. ఈ బాధ పడలేక వాళ్లు ఇంటాయనతో చెప్పుకున్నారు.

"మీరు అలాంటి పోకిరీవాళ్ళకు గది అద్దెకిస్తే ఎలాగండి? మా పరువు మర్యాద లేమయినా నిలిచేటట్లున్నాయేమో చూడండి!"

"నేనేం చేసేది"...అంటూ నీళ్ళు నమి లాడు.

నిజమే! ఆయన ఏం చేయగలడు?— వాళ్ళకుండాలి గాని బుద్ధి. పోనీ తనుపోయి పక్క ఇళ్ళలో ఉంటున్న అమ్మాయిల వంక చూడవద్దని చెప్తే చూడకుండా ఉంటారా?

ఆ అమ్మాయిలు ఈయనతో లాభంలేదని ప్యారిస్‌లో పి హెచ్.డి. చేస్తున్న వాళ్ళమ్మాయికి వ్రాశారు ఆ అమ్మాయి వెంటనే— "కంప్లెయింట్ బుక్" ఒకటి పెట్టమని వాళ్ళ నాన్నగారికి వ్రాసింది. కంప్లెయింట్ రీజనబుల్‌గా ఉంటే గది ఖాళీ చేయాలి!

దాంతో పాపం గదిలో చేరిన ప్రతి వాడూ నెలకన్నా ఎక్కువ ఉండలేక పోతున్నారు. కాని ప్రభాకరం చేరి అయిదు నెలలయినా ఒక్క కంప్లెయింటయినా లేదు ఆ కారణాన ఇంటి వాళ్ళకు కూడా ప్రభాకరం అంటే ఎంతో గౌరవం, మరెంతో అభిమానం!

ఇంత మంచి గదీ, మర్యాదగల వాళ్లనూ వదిలిపెట్టి—ఆరోగ్యం సరిగా ఉండని కారణాన యాభై రూపాయలుపోసి సౌకర్యాలు లేని ఇంట్లో ఉండటం ఎందుకులే. అని బామ్మను తీసికొచ్చే ప్రయత్నంనుంచి విరమించుకున్నాడు. నీళ్ళు అలవాటుపడితే ఆరోగ్యం అదే బాగుంటుంది. మొదట్లో కన్నా ఇప్పుడు నయంగా ఉంది కొంత వరకు!

కాని రామనాథంగారు ఉత్తరాలు వ్రాస్తూనే ఉన్నారు—

ప్రభాకరం ఏం సమాధానం వ్రాయాలా



# ★ ఇల్లు కాదు..ఇల్లాలు ★

అని ఆలోచిస్తూనే ఉన్నాడు. మూర్తి కాల్కులస్ క్లాసు ముగించుకుని వచ్చాడు.

"మీ నాన్నగారినుంచేనా ఉత్తరం?"

సమాధానంగా ఉత్తరం అందించాడు ప్రభాకరం.

మూర్తి చదువుకుని—"దీనికోసం అంత దిగులెందుకు? శుభ్రంగా రాసేయి-రమ్మని."

"ఆయన్ని రమ్మనా?!" ఆశ్చర్యపడ్డాడు ప్రభాకరం.

"అవును. ఆయన్నే. ఏం?"

"ఇన్నాళ్ళదాకా నువు తెలివిగలవాడి వనుకుంటున్నాను."

"ఏం? నా సలహా అంత తెలివి తక్కువతనంగా ఉందా?"

"వెధవతనంగా కూడా ఉంది. ఆయన వచ్చారా—ఏదో ఒక ఇల్లు సెటిల్ చేసేస్తారు—చీప్‌లో. అది ఎలా ఉండేది, ఎంత అసౌకర్యంగా ఉండేది నేను వేరే చెప్పనక్కర్లేదు. ఆ మాత్రం మనం చూడలేక పోయామని చవటక్రింద లెక్క కట్టారు. అసలు విషయం ఆయనకేం తెల్సు? మన మెటువంటి సౌకర్యాలు కోరుతున్నామో ఆయనకేం అర్ధమవుతయ్?"

ప్రభాకరం చెప్పినమాట నిజమేననిపించింది మూర్తికి.

జీవితంలో అనుభవాలు ఇంకా బొప్పి కట్టేలా మొత్తిన కొట్టలేదు కాబట్టి, ప్రభాకరం ఆలోచనలు సుఖమూ, సౌకర్యాల మీదికి పోతున్నాయి. ఇన్నాళ్ళూ స్వంత ఇంట్లోనూ, హాస్టల్లోనూ ఉంటూ వచ్చాడు కాబట్టి చాలీచాలని అద్దెకొంపలో కాలం వెళ్ళబుచ్చే సహనం ఇంకా ఏర్పడలేదు. సంసార ఝంఝూటంలోకి దిగలేదు కాబట్టి అవసరం తాలూకు ఒత్తిడి బాగా అవగాహనం కావటంలేదు.

ఉన్నంతలో ఉండి, లభించినదానితో తృప్తిపడితేగాని మనశ్శాంతి ఉండదని, జీవితాలు గడవ్వని తెల్సుకున్న రామనాథంగారు ఏదో ఒక ఇల్లు ఖాయంచేసిపోతారనే మాట నిజమే!

ప్రభాకరం పరిస్థితి మూర్తి హృదయంలోని సానుభూతిని చూఱగొంది.

"నాకేమీ పాలుపోవటంలేదు మూర్తీ! ఏంచేద్దామంటావ్?" మొహం వ్రేలాడేశాడు ప్రభాకరం.

"సాయంత్రం ఉత్తరం వ్రాసేయి—ఒకటీ రెండు రోజుల్లో ఏదో ఒకటీ ఖాయం చేసుకుని తెలియజేస్తానని."

ప్రభాకరం భయంకరమైన వార్తేదో విన్నట్లు ఉలిక్కిపడి—

"వద్దు బాబూ! నేను తిరగలేను. ఆ వందరూపాయల మేడలో ఎవరూ చేఱలేదుగా ఇంతవరకు. తేరమాడితే ఎనభయికో, తొంభైకో ఈయకపోరు. అది తీసేసుకుందాం." అని అన్నాడు.

బహుశా ప్రభాకరానికి పూర్వం నాలుగయిదు రోజులు కాళ్ళునొప్పులు పుట్టేలా ఇళ్ళకోసం తిరిగిన తిరుగుడంతా జ్ఞప్తికి వచ్చి ఉంటుంది!

"ఎవ్వరూ రాకపోతే ఆయన ఖాళీగానే ఉంచుతాడుగాని—కానీ అద్దె తగ్గించడు. రేపు మాద్దాంలే..."

కాలేజీ వదిలేశారు. ఇద్దరూ గృహోన్ముఖులయారు.

* * *

కాఫీ తెచ్చేందుకు హోటలుకుపోయిన నౌకరు కుఱ్ఱాడు ఇంకా రాలేదేమిటా అని బాల్కనీలోకి వచ్చి రోడ్డుమీదికి చూస్తోన్న ప్రభాకరానికి తన రూముపైపే వస్తోన్న మూర్తి కన్పించాడు.

"హల్లో! గుడ్ మార్నింగ్!" విష్ చేశాడు మూర్తి క్రిందినుంచే.

మూర్తి మొహంలో ఎన్నడూ లేని ఆనందం వెల్లివిరుస్తోంది. మంచి ఇల్లేమైనా చూసివచ్చాడా ఏమిటి?

"బెస్ట్ మార్నింగ్! ఏమిటీ విశేషం! అంత సంతోషంగా ఉన్నావీపూట?"

"నీ సమస్యకు మంచి పరిష్కారమార్గం గోచరించింది."

"ఏమిటో అది. నాకుకూడా చెప్పు. విని సంతోషిస్తాను."

అంతలోకి బాయ్ కాఫీ తెచ్చాడు.

కాఫీ సిప్ చేస్తూ "సంధ్యమీద నీ అభిప్రాయమేమిటి?" అని అడిగాడు మూర్తి—కాఫీపొగల్లోకుండా ప్రభాకరాన్ని చూస్తూ.

ప్రభాకరానికి మూర్తి ప్రశ్న చాలా అసందర్భంగా కన్పించింది—తన ఇంటిసమస్యకూ సంధ్యమీద తన అభిప్రాయానికి గల సంబంధమేమిటో అవగాహనకాలేదు.

"బుద్ధిమంతురాలు. మర్యాద తెలిసిన పిల్ల. తెలివితేటల్లో యావరేజ్."

మూడుమాటల్లో తన అభిప్రాయం చెప్పాడు ప్రభాకరం.

"అంతవరకు బాగానే ఉంది—అందచందాల్లో?"

తను ఇల్లుచూసి పెట్టమన్నాడు గాని—పెళ్లి సంబంధం కాదే—అని ఆశ్చర్యపడసాగాడు ప్రభాకరం.

"ఫర్వాలేదు బాగానేఉంటుంది. ఎబవ్ యావరేజ్ ..."

ప్రభాకరం పరిశీలనగా సంధ్యనెన్నడూ చూడలేదు. ఆమాటకొస్తే ఏ ఆడపిల్లనూ—సౌందర్యం అంచనావేసే దృష్టిలో చూడలేదు. ఒకరోజునమాత్రం సంధ్యా, శ్యామా క్లాసుకొకటిగా వచ్చారు. శ్యామ కట్టిన నైలాన్ శారీలోంచి లంగా, జాకెట్టూ—ఆ వెనుక శరీరమూ కన్పిస్తూ చాలా అసభ్యంగా ఉంది; సంధ్యకట్టూ-బొట్టూ అతి సహజంగానూ, ఎంతో సభ్యత సూచిస్తూను పవిత్రభావం కలుగజేస్తున్నాయి.

"నీమీద ఆ అమ్మాయికి సదభిప్రాయమే ఉంది..."

"నువ్వనేది నాకసలేమీ అర్థంకావటం లేదు. మన గృహాన్వేషణలో సంధ్య ప్రసక్తి దేనికి!"

"ఇల్లుచూసి ఇల్లాల్ని చూడమన్నారు పెద్దలు. కాని నేనుమాత్రం ఇల్లాలిని ముందు చూసుకుంటే ఇల్లు దానంతటదే వస్తుందంటాను."

"నీ మొహం. ఆ సామెత నీకర్థంకాలేదు. ఇంటి పరిశుభ్రత, అలంకరణనూ బట్టి ఇల్లాలి అలవాట్లూ, అభిరుచులూ తెల్సుకోవచ్చునని దాని అర్థం."

"నా ఉద్దేశం ఇద్దరం తప్పుగా అర్థం చేసుకున్నామని. అదంతా మనకనవసరం ప్రస్తుతం. నేను చెప్పినట్లు నడుచుకుంటే నువు కోరుకొంటున్న సౌకర్యాలు సమస్తమూకల మంచి ఇల్లు ఒకటి అద్దిలేకుండా దొరుకుతుంది."

ప్రభాకరం ఆశ్చర్యపోయాడు. అద్దె లేకుండా అన్ని సౌకర్యాలుగల ఇల్లా? ఎంతవరకు నిజం—మూర్తి అనేది?

"పరిహాసా లాడుతున్నావా మూర్తీ?"
పొద్దున్నే...అందులో నీతోనా?"

* * *

గవర్నరుపేటలో కొత్తగా ఒక మేడ కట్టారు—ఇటీవలే రిటైరయిన సూపరింటెండింగ్ ఇంజనీరు సుందరంగారు. ఆయన కుమార్తె సంధ్య. ఇంటరు రెండవ సంవత్సరం చదువుతోంది. మూర్తి నాన్నగారు, సుందరంగారు బాల్యస్నేహితులూ, దూరపుబంధువులూ అయిన కారణాన మూర్తి సంధ్యకు మేథమేటిక్స్‌లో ట్యూషన్ చెప్తున్నాడు.

"అమ్మాయి మేథమేటిక్స్‌లో ఇప్పుడు ఫర్వాలేదు. కాని ఫిజిక్స్‌లో చాలా పూర్‌గా ఉందండి," అన్నాడు మూర్తి ఆనాడు పాఠంముగించి ఇంటికి పోబోతూ.

"అలాగుటోయ్. మరి న్నాళ్ళదాకా చెప్పావు కాదేం? పరీక్షలుకూడా దగ్గఱకు వచ్చినట్లున్నాయి." సుందరంగారు ఆదుర్దాపడ్డారు.

"స్వంతంగా చదువుకుని మేకప్ చేసుకుంటుందేమోనని ఇన్నాళ్ళూ చూశాను.

# ★ ఇల్లు కాదు .. ఇల్లాలు ★

కాని...."

"మరి ఫిజిక్స్‌లో ట్యూషను చెప్పేవాళ్ళెవరూ లేరా?"

"లేరండి...అదొక తిప్పలు."

"ఫీజు బాగా ఇస్తామన్నా చెప్పేవాళ్ళు లేరా?"

"లేనంటే మనవాళ్ళుకదా అని ఇంటికి వచ్చి చెపుతున్నాను. అందరూ ఎందుకు వస్తారండి?"

"పోనీ మనింటికివచ్చి చెప్పకపోతే మానె వాళ్ళింటికే పోయి చెప్పించుకుంటుంది."

"కాని పెళ్ళికానిపిల్లను పంపిస్తున్నామంటే..."

"అవునోయ్. నువ్వనేదీ ఆలోచించాల్సిన విషయమే. నువేం చేద్దామంటావ్?"

"మా ఫ్రెండొకడున్నాడండి. చాలా మంచివాడు. మర్యాదస్తుడు—ప్రభాకరమని. మన అమ్మాయివాళ్ళకి కాలేజీలో చెప్పేది అతనే. అడిగిచూస్తాను. ట్యూషనేమయినా చెప్తాడేమో!"

"ఫామిలీతోనే ఉంటున్నాడుగా!"

"ఇంకా పెళ్ళికాలేదండి...కాని బుద్ధిమంతుడండి."

"అయినా అతని ఇంటికెలా పంపిస్తావోయ్! లోకులేమనుకుంటారు?"

"అడిగిచూస్తాను—పోనీ మనింటికివచ్చి చెప్తాడేమో!"

"జీతం బాగా ఇస్తామనిచెప్పు."

"ఆ మాటంటే అసలికే మోసం వస్తుందండోయ్."

* * *

పాఠంచెప్పి ఇంటికి పోబోతున్న ప్రభాకరాన్ని ఆపింది సంధ్య—"ఉండండి! కాఫీ తెస్తున్నది వంటమనిషి."

కాఫీ సిప్‌చేస్తూ—"మేడమీదంతా ఖాళీగా ఉంచారేమిటండి?" తెలియనట్లు అడిగాడు ప్రభాకరం.

"మా అన్నయ్యకు మద్రాసు ట్రాన్స్ఫరవటంతో ఖాళీగా నేఉంది. అద్దెకియ్యాలనుకుంటున్నాం. వందరూపాయలు చెప్తున్నారు మా నాన్నగారు. ఇంకా ఎవ్వరూ రాలేదు."

"వంద రూపాయలేనా? కళ్ళకద్దుకు తీసుకోవచ్చును కదండి—ఇన్ని సౌకర్యాలున్న మేడ."

ఇంటికివచ్చి చెప్పించుకుంటామన్న మగపిల్లలకీ. ఆడపిల్లలకీ-తనకు తీరదని_ట్యూషను చెప్పనన్న ప్రభాకరం ఇంటికిపోయి రోజూ శ్రద్ధగా సంధ్యకు ట్యూషను చెప్పటం విద్యార్థులకూ, లెక్చరర్లకూ ఆశ్చర్యం కల్గించింది.

విద్యార్థులు గుసగుసలాడుకుంటున్నారు. గోడలమీదకెక్కించే వాళ్ళేమోగాని ప్రభాకరం ప్రవర్తనమీదకల గౌరవం, అతని విద్యాబోధనమీది అభిమానమూ వలన అలాంటి అసభ్యమైన పనులేమీ చేయ సాహసించలేదు.

కాని ఇంగ్లీషు లెక్చరరు రావు ఎవరూ లేకుండా చూసి-"సంధ్యకు ఇంటికిపోయి ట్యూషను చెప్తున్నావుటగా. ఏమిటా గిరాకీ?"

"ఆ గిరాకీ ఏముంది? వాళ్ళ నాన్నగారు అడిగారు. చెప్తున్నాను. అదీగాక..."

"ఆ అమ్మాయీ ప్రార్థించింది... అంతేనా?" అంటూ వ్యంగ్యంగా నవ్వాడు రావు.

"ఆ అమ్మాయెందుకు ప్రార్థిస్తుంది?" కోపం చంపుకుంటూ ఎదురు ప్రశ్న వేశాడు.

"ఐయాం సారీ! ఎందుకు ప్రార్థిస్తుంది_ ప్రేమిస్తుందిగాని..." అంటూ వెకిలిగా నవ్వాడు రావు.

అంతలోకి బెల్ కొట్టారు.

"క్లాసుంది" అంటూ ప్రభాకరం వెళ్ళిపోయాడు.

ఆ సాయంత్రం ఇంటికిపోతున్న మూర్తిని కేకవేశాడు.

మధ్యాహ్నం రావు అన్నమాటలన్నీ పూసగుచ్చినట్లుగా చెప్పాడు.

"అలా విచారిస్తావేమోయ్ సంతోషించక"

"ఏం సంతోషించమంటావ్? నీ ప్లాను కాదుగాని-నా పేరు పరువు-ప్రతిష్ఠలూ పోయేటట్లున్నాయి. ఇవ్వాళ రావు అన్నాడు రేపు రాజు అంటాడు. ఎల్లుండి విద్యార్థులే అడుగుతారు. నేనేమొహం పెట్టుకు తిరుగుతాను. రాజీనామా ఇచ్చి ఊరు విడిచిపోవాల్సిందే!"

"అక్కడే పొరపడుతున్నావ్. విద్యార్థులుకూడా అంటారు. అక్కడితో ఆగరు. క్లాసు బోర్డులమీదకూడా వ్రాస్తారు. కాని నీవు రాజీనామామాత్రం ఈయకూడదు. ఈయవు నాకు తెల్సును."

పదిహేనురోజులు గడిచినాయి.

ఇంకో ఉత్తరం వచ్చింది రామనాథంగారినుంచి_"నేనువచ్చి కనుక్కుందామంటే ఇక్కడ పనులుతీరటం లేదు. ఏం చేస్తున్నావ్ నీవు? నాలుగయిదు రోజుల్లో ఏదో ఒకటి ఖాయంచేసి ఉత్తరం వ్రాస్తానన్నవాడివి పదిహేనురోజులయినా అతీగతీ లేదు. ఆరోగ్యం తాలూకు ప్రాముఖ్యం ఇంకా నీకు తెలిసినట్లు లేదు. ఆరోగ్యం తాలూకు ప్రాముఖ్యం ఇంకా నీకు తెలిసినట్లు లేదు. ఆరోగ్యం ఉంటేనే ఏ సుఖాలయినా పొందగల్గేది!"

మూర్తి దానికి సమాధానంవ్రాయించాడు.

"ఒక ఇల్లుచూశాను. అద్దెకూడా ఫరవాలేదు. వెల్లవేసి అయిదారు రోజుల్లో తాళం చెవి ఇస్తామన్నారు."

"ఇంత వచ్చి అబద్ధమా! కొంపదీసి ఉత్తరం అందుకోగానే ఆయనవచ్చి 'ఏది! ఆ ఇల్లు. చూద్దాంపదండి' అంటేఏం చెప్తాం? మొత్తానికి నువ్వు నా పరువుమంట కల్పేటట్లున్నావ్!"

"మాట్లాడకుండా నే చెప్పినట్లు చేయి. లేదా నన్ను పోనీయి. నీ ఇష్టం వచ్చినట్లు చేసుకో..." కోపం నటించాడు మూర్తి.

మూర్తి అన్నంతపనీ అయింది.

బ్లాక్ బోర్డుమీద ప్రభాకరం సంధ్య ఇద్దరి పేర్లూ కల్పి వ్రాసిఉన్నాయి.

ప్రభాకరం వెంటనే సెలవుచీటి ప్యూను ద్వారా ప్రిన్సిపాలుకు పంపించి రూముకి పోయాడు; ఎలా పోతాడు క్లాసుకు?

మూర్తి సాయంత్రం వచ్చేసరికి ప్రభాకరం ముసుగుతన్ని దోమతెర మరి వేసుకుని పడు

(55-వ పేజీ చూడండి)



# శ్రీకృష్ణ న్యూఢిల్లీ లేఖ

భారత సాధూ సమాజం మూడవ వార్షికోత్సవం ఇటీవల న్యూఢిల్లీలో జరిగింది. మంగళాచరణంతో సమావేశం ప్రారంభమైంది. యోగులు, మహాత్ములు సభ జయప్రదంగా జరగాలని ఆశీర్వదించారు. కేంద్ర సలహామండలి అధ్యక్షుడు శ్రీ గుల్జారీలాల్ నందా అందరినీ పరిచయం చేశారు. ఉపరాష్ట్రపతి డా॥ ఎస్. రాధాకృష్ణన్ ప్రారంభోపన్యాసం చేశారు. ప్రధాన మంత్రి వుపన్యసించారు.

భారత రాష్ట్రపతి ఇటీవల "కేంద్రీయ భవన్" కు శంకుస్థాపనచేశారు.

పైన చెప్పిన ప్రముఖు లందరూ ఈ దేశంలో మతాతీత వ్యవస్థకు మూలస్తంభాలనదగినవారు. అందుచేత సాధుసమావేశం చేసిన తీర్మానాలు చిత్రంగా కనిపిస్తాయి. "మత సంస్థలకు సంబంధించిన ఆదాయాలను, నిధులను, ఆ సంస్థలు నిర్దేశించిన లేక సంప్రదాయంగా వస్తున్న మత ప్రయోజనాలకు తప్పిస్తే మరే ఇతర ప్రయోజనాలకు ఉపయోగించ గూడదు" అని సమావేశం తీర్మానించింది. అలా స్పష్టంగా మత ప్రయోజనాలకు నిర్దేశించని సందర్భాల్లో, నిధులను సాధువుల విద్యకు ఉపయోగించాలని ఆ తీర్మానం ఆదేశించింది.

ప్రెస్ ఇన్‌ఫర్మేషన్ బ్యూరో విడుదలచేసిన ఒక ప్రకటనలో "వెనుకబడిన కులాలవారని అనబడే కోట్లకొలది భారతీయులు నిజంగా సాంఘిక, సాంస్కృతిక, ఆర్థిక రంగాలలోనే వెనుకబడి ఉన్నా"రని సమాజం మరొక తీర్మానంలో ఆందోళన వెల్లడించినట్లు ఉంది.

ఒక సందేహం. ఈ సాధువుల సమావేశం వివరాలు ప్రెస్ ఇన్‌ఫర్మేషన్ బ్యూరో ద్వారా పత్రికలకు అందజేయటానికి కారణమేమిటి? భారత్ సాధుసమాజం ప్రభుత్వంలో ఒకశాఖా?

మత్తయ్ వ్యవహారం చూసిన తరువాతనైనా ప్రెస్ ఇన్‌ఫర్మేషన్ బ్యూరో పాఠం నేర్చుకుని ఉండాల్సింది. సాధుసమాజం ఉదంతం చూస్తే ఈ బ్యూరోకు ఏది ప్రభుత్వ సమాచారమో, ఏది కాదో తెలుసుకునే సమర్థత లేదనిపిస్తోంది. శ్రీ నందాగాని ప్రధానమంత్రిగాని ఒకానొక సంస్థతో సంబంధం కలిగిఉన్నారన్నంత మాత్రాన ఆ సంస్థ ప్రభుత్వసంస్థ అయిపోదు.

## సాధు సమాజ వ్యవహారం

సాధువులకు కార్యాలయభవనం ఎందుకు అవసరమైందో, ఆ భవనం న్యూఢిల్లీలోనే ఎందుకుండాలో తెలియటంలేదు. కాంగ్రెసువారు కోఆపరేటివ్‌ల పేరుతో కమ్యూనిస్టులనూ, సాధుసమాజంతో, రామలీలా ఉత్సవాల్లో తిలకధారణంతో జనసంఘనూ మించిపోవాలని తాపత్రయ పడుతున్నట్లు తోస్తుంది.

ఆహారమంత్రి శ్రీ అజిత్ ప్రసాద జైన్ పప్పులో కాలేసి చప్పున సద్దుకున్నారు. ఇది మెచ్చదగిన విషయం. ఎగుమతి విధానానికి సంబంధించిన ప్రభుత్వప్రకటన వెలువడినప్పుడు దేశంలో పంచదార ఎంతకు అమ్ముతున్నదో అంతకుమించి ధరలు పెరగవని భ్రమపడి, పంచదార ఎగుమతికి అనుమతించటమే ఆయనచేసిన పొరపాటు. జరిగినదేమిటంటే, ఎగుమతివిధానం ప్రకటించగానే పంచదారధరలు అంతకుముందుకంటె బాగా పెరిగిపోయాయి. ఇంకా పెరుగుతున్నాయి. పంచదారధరలు పెరిగితే జీవనవ్యయ సూచికలో అంకెలు కూడా పెరుగుతాయనేది అందరూ ఎరిగిన విషయమే. ఇప్పుడు పంచదార ధరలను అగుపుచేయటానికి ఆహారశాఖ చేసిన ప్రయత్నాలన్నీ విఫలమైనాయి గనక, ఆహారమంత్రి పంచదార ఎగుమతిని నిషేధించటానికి చర్యలు తీసుకున్నారు.

దీంతో ఎగుమతులకు సంబంధించిన ఒక ముఖ్యసమస్య ఉత్పన్నమవుతున్నది.

ఎగుమతులను ప్రోత్సహించటానికి వాణిజ్యశాఖ ఒక పద్ధతి అవలంబించింది. దేశంలో వస్తువుల ధరలు పెంచేసి ఎగుమతులకు సహాయం చేయటమే ఈపద్ధతి. దేశంలో ధరలు ఎక్కువగా ఉంటే, వస్తువులవాడకం తగ్గుతుందనీ, ఎగుమతులకు సరుకులభిస్తుందనీ దీనిభావం. కాని ఈభావం ఆచరణలో పలకటంలేదు. లోటు ఆర్థిక విధానంవల్ల ప్రజలచేతుల్లో డబ్బు బాగా ఆడుతోంది. దీనివల్ల డిమాండు పెరుగుతోంది. అంటే ధరలెంత ఎక్కువగాఉన్నా కొనేవాళ్ళు ఉండటంచేత ఉత్పత్తిదారుకు దేశంలోనే కావలసినంత మార్కెట్ వుందన్నమాట.

ఇక విదేశీ కొనుగోలుదారు సంగతి. చైనానుంచి వచ్చే ఎగుమతులతో మార్కెట్లన్నీ నిండిపోతుంటే భారతప్రభుత్వపు ధనసహాయంతో వచ్చేఎగుమతులను ఎవరుకొంటారు? వుదాహరణకి:— భారత దేశపు వస్త్రాలకంటె చవకగా చైనావారు నూవాసన వస్త్రాలను అమ్ముతున్నారు.

దీనివల్ల తేలేదేమిటంటే, వాణిజ్యశాఖ విధానం భారతీయ పారిశ్రామికులకు లాభాలు చేకూర్చేందుకే పనికివస్తోంది. దేశంలో డిమాండు ఉండి, కొనుగోలుదారును సంతృప్తిపరచలేక పోయినంత

కాలమూ, విదేశాల మార్కెట్లలో మనవస్తువులు ధరలోగాని, నాణ్యంలోగాని పోటీకి తట్టుకోలేనంతకాలమూ ఎగుమతులను ప్రోత్సహించటమనేది వట్టి నినాదంగానే మిగిలిపోతుంది. దీన్ని ఒక విధంగా పరిష్కరించవచ్చును. వాణిజ్యమంత్రి కార్మిక శాఖను, కార్మికమంత్రి వాణిజ్యశాఖను పుచ్చుకుంటే ఒకరి కష్టసుఖాలు మరొకరికి తెలిసివస్తాయి.

*    *    *

నూనె శాఖకు సంబంధించినంతవరకూ పార్లమెంటుకు సమస్యలను ముఖాముఖి ఎదుర్కొనటంఇష్టంలేదని విదితమవుతోంది. ఇది ఈక్రింద ఉదహరించిన ప్రశ్నలు, సమాధానాలతో తెల్లమవుతుంది :

పండిట్ డి. ఎన్. తివారీ : నూనె శుద్ధి కర్మాగారం స్థాపించటానికి స్థలం ఏదైనా కొన్నారా? సంప్రతింపులు ఎప్పుడు పూర్తవుతాయి?

శ్రీ గజేంద్రప్రసాద్ సిన్హా :బ—రావునీ నూనె శుద్ధి కర్మాగారంవిషయమై రష్యాతో సహా వివిధదేశాలతో సంప్రదింపులు జరుపుతున్నామని నేనిదివరకే చెప్పాను. ఈ సంప్రదింపులు పూర్తయితేనే గాని స్థలం కొనే ప్రసక్తిరాదు.

శ్రీ ఆర్. సి. మఝి:—ఈ నూనె శుద్ధి కర్మాగారం స్థాపించటానికి ఎంత అవుతుందో అంచనా వేశారా? అయితే ఎంత?

శ్రీ కె. డి. మాలవీయ:—బరావునీవద్ద నిర్మించదలచిన కర్మాగారానికి ఎంత ఖర్చయ్యేదీ రష్యాతో జరుపుతున్న చర్చల ఫలితాలమీద ఆధారపడి ఉంటుంది. చర్చల సంగతి తేలితేగాని వ్యయం సంగతి తేలదు.

స్పీకరు:—ఇంతవరకూ అంచనా లేమీ వేయలేదా?

శ్రీమాలవీయ:—మా వద్ద రెండో, మూడో, నాలుగో ప్రతిపాదనలున్నాయి. వారు ఒక ప్రతిపాదనకు సమ్మతించరనుకోండి. అప్పుడు ఖర్చు అంచనా అంతా మార్చుకోవలసి వుంటుంది.

శ్రీ విద్యాచరణ్ శుక్లా:—ఈ కర్మాగారం వివరాలను ఒక అమెరికన్ సలహాదారుల కంపెనీకి చూపించారుగదా? వారేమన్నారు?

శ్రీ మాలవీయ: అమెరికన్ సలహాదార్లు మొదట తయారు చేసిన ఉత్పత్తి ప్రాజెక్టు నివేదిక మనం సూచించిన అవసరాల ఆధారంగానే తయారు చేయబడింది. మనం 60 వేల టన్నుల ల్యూబ్రికెంట్లు, నూనెలు తయారు చేయాలనుకున్నాము. ఇప్పుడీ సమస్య లన్నిటినీ వివరంగా పరిశీలించవలసి ఉంటుంది.

శ్రీ రామ్‌కృపన్ గుప్త: రష్యాతోను, కొన్ని ఇతర దేశాలతోనూ ఇంకా సంప్రదింపులు జరుగుతున్నాయని పార్లమెంటరీ కార్యదర్శి ఇప్పుడే చెప్పారు. ఆ ఇతర దేశాలేవి?

శ్రీ మాలవీయ: నా సహోద్యోగి చెప్పిన దానికి నేను మరికొంచెం చేరుస్తాను. వివిధ దేశాలతో సంప్రదింపులు జరిపే దశను మనం దాటిపోయాము. ఇప్పుడు ఆఖరుగా జరుగుతోందేమిటంటే, బరావునీ కర్మాగారం విషయమై ఇప్పుడు రష్యా ప్రభుత్వంతో మనంజరిపేచర్చలుఆఖరు దశలోఉన్నాయి.

శ్రీ డి. సి. శర్మ :— ఈ కర్మాగారానికి కావలసిన డబ్బులో మనకి మనం ఎంత సమకూరుస్తున్నాము? ఇతర దేశాలనుంచి ఎంత తెచ్చుకుంటున్నాము?

శ్రీ మాలవీయ :— మనడబ్బెంతో, ఇతర దేశాల సహాయంఎంతో, చర్చలు పూర్తయిన తర్వాత ఈసభకు నివేదిస్తాము. యంత్ర పరికరాలకు సంబంధించిన సహాయమంతా ఇతరదేశాలనుంచే తెచ్చుకోవాలని మా ప్రయత్నం.

శ్రీ ఎమ్. ఆర్. కృష్ణ :— ఇతరదేశాలు మన అవసరాలకు తగినట్లు సహాయం చేయటానికి ఇష్టపడక పోవటంవల్లనా, లేక వారి షరతులు ప్రభుత్వానికి నచ్చకపోవటంవల్లనా మనప్రభుత్వం రష్యాను సహాయం అడగాలని నిశ్చయించుకున్నది?

శ్రీ మాలవీయ :- రష్యాప్రభుత్వం వారి ప్రతిపాదనలను ఆఖరుసారిగా పరిశీలించగా మనంపెట్టిన షరతులకు అవే ఎక్కువ అనుకూలంగా ఉన్నట్లు కనిపించింది.

స్పీకరు :- ధోరణి చూడగా చర్చలు కొంత వరకె సాగినట్లు కనబడుతోంది. కర్మాగారం ఎప్పటికి పనిచెయ్యటం మొదలు పెడుతుందో చెప్పటానికి వీలుందేమో తెలుసుకోవచ్చునా?

శ్రీ మాలవీయ :- ఎప్పటికి పనిచేయటం మొదలవుతుందో ఇదివరకే చెప్పాము. 1962 మొదటి నెలల్లో ఎప్పుడో ఉత్పత్తి మొదలు కావచ్చును.

శ్రీ హేమ్‌బారువా :- శ్రీ మాలవీయ మాస్కోలో చర్చలు జరిపి వచ్చిన తరవాత ఏమైనా మళ్ళీ చర్చలు జరిగాయా? జరిగితే ఎన్నిసార్లు జరిగాయి? అవేమైనా ఫలించే సూచనలున్నాయా?

శ్రీ మాలవీయ :- అవన్నీ వివరాలకు సంబంధించిన విషయాలు. నేను సమాధానం చెప్పలేననుకుంటాను.

స్పీకరు :- దానివల్ల మన విజ్ఞానం అణుమాత్రమైనా పెరిగేదేమీ లేదు. ★

# విరుద్ధ మనస్తత్వం

భమిడిపాటి జగన్నాధరావు

రామం నన్ను దూరాన్నించే చూసి 'విష్' చేశాడు.

'అప్పుడే మిత్రబృందం అంతా వచ్చి నట్టుందే' అనుకుంటూ, వాళ్ళ దగ్గరిగా వచ్చి, సైకిలుదిగి, వాళ్ళ మధ్యగా పచ్చగడ్డి మీద కూచున్నాను.

కాలికింద పచ్చగడ్డి మెత్తగా తగిలింది. చల్లటిగాలి హాయిగా సోకింది.

దూరాన్న పంటకాలవలో సాయం సంధ్య వెలుగు ప్రతిఫలిస్తోంది. పేరు తెలీని తెల్లటి పక్షులగుంపు, ఆకాశంలో అంతులేని ప్రయాణం చేస్తున్నట్టుగా, రెక్కలు బారుగా చాచి, ఒక క్రమంలో పోతున్నాయి.

మిత్రులంతా తీవ్ర చర్చలో వున్నారు. వాళ్ళు మాట్లాడే విషయం గూడా తెలీడం లేదు. ఒకడిమాట పూర్తిగాకుండా మరోడు అందుకుంటున్నాడు.

ఒక్క జనార్దనం మాత్రం సంధ్యకేసి చూస్తూ కూచున్నాడు. చూపు తిప్పడం లేదు.

పశ్చిమాకాశం చిక్కటి ఎరుపు రంగు పులుముకొంటోంది.

ఉన్నట్టుండి "ప్రియురాలి కందిన వదనంలా ఉందీ సాయంకాలపుటాకాశం. ఏ దృక్పథంనుండి చూసినా నాకు ఈ అరుణాకాశంనుండి తెలుసుకోదగిందీ, గ్రహింపగల్గిందీ అంతకంటే ఏం లేదనిపిస్తోంది. ఏం? నేనిలాగే వర్ణిస్తా నా కథల్లో. నా కంటికేదెలా కనబడితే అలాగే వ్యక్తపరుస్తా," అన్నాడు జనార్దనం, అందరికేసీ తిరిగి.

అతను ఈ రోజున ఇంత నిక్కచ్చిగా నలుగురిలోనూ ఈ సంగతి చెప్పనవసరం లేదు. ఈమధ్య జనార్దనం రాస్తూన్న కథలన్నిటిలోనూ ఇదే వరస.

తక్కిన మిత్రులంతా జనార్దనానికి సమాధానం చెప్పక ఊరుకున్నారు.

కాని నాకు కొద్దిగా కథలు రాయడం, కాస్త సభ్యతకు లోటు లేకుండా గ్రంథ పరిజ్ఞానం ఉండటంచేత, ఆ ఆసరా చూసుకొని, ఈ వేళ అతగాణ్ణి సంభాషణలోకి లాగి, ఓపూపు పూపుదామనుకున్నాను.

"ఇప్పుడు మీరన్న దాంట్లో అర్థం చాలా అల్పంగా వున్నట్టు తోస్తోంది," అన్నాను.

అప్పుడే కాల్చి పారేసిన సిగరెట్టు తాలూకు పొగ తిరుగుతూన్న మెలికలు చూస్తూ "అలా రండి...ఆ పక్కగా వెళ్దాం, నేనన్నదాంట్లో అర్థం అల్పం కాదనీ—ఈ అనంత విశ్వంలోని పరమార్థమే నన్న నగ్నసత్యాన్ని మీ చేతే అనిపిస్తాను" అన్నాడు జనార్దనం.

నేను ఈ 'ఛాన్సు' వదిలదలుచుకోలేదు. అతన్ని వాదనలో చిత్తు చేద్దామన్న ఆశ మనసుకు పట్టుకుపోయింది. మిత్రులందరిలోనూ అతన్ని ఓడించి, గెలుపు సాధిద్దామన్న ఆశ మరీ ప్రోత్సాహమిచ్చింది.

కాని అప్పుడే జనార్దనంలేచి, నాకేసి రమ్మన్నట్టు చూస్తూ, ముందు కదు గేశాడు. అయిష్టంగానే లేచి అతన్ని అనుసరించాను—మిత్రు లందరి మధ్యా అతన్ని ఓడించాలన్న ఊహను పక్కకి నెట్టేసి.

ఇద్దరం దూరంగా నిర్జనంగా వున్న ప్రదేశానికి పోయాం.

"అంటే మీరంటూన్న వేదాంతానికి మూలం 'రియలిజమా?' " అన్నాను. వెటకారం ధ్వనిస్తూ, సరిగ్గా ఆ 'రియలిజమ్' అన్న పదానికి అర్థం తెలీకపోయినా, అలాటి పెద్ద మాటలుపయోగించి గెలుపు సాధిద్దామని మొదటే నిర్ణయించుకొన్నానుగా మరి—

"మీరు నా వాదానికి, ఏ పేరూ పెట్టకండి...పేర్లతో నిమిత్తంలేదు," అన్నాడాయన కొంచెం సీరియస్‌గా.

నేనేదో కులాసాగా మాట్లాడుతూ వాదిద్దామనుకుంటే, ఈ మూలకి తీసుకొచ్చి, ఈ సీరియస్ నెస్ ఎందుకీయనకి అని నాకప్పుడే తట్టింది.

మా ఇద్దరిమధ్యా ఆవరించిన నిశ్శబ్దం నన్ను విశేషంగా బాధిస్తోంది.

ఈయన ఏదో చెపుతానని తీసుకొచ్చిన విషయం మర్చిపోలేదు గదా!

"మీరుకూడా కథలు రాస్తారుకదూ?" హఠాత్తుగా అడిగేడాయన.

'ఇదేమిరా! కథ అడ్డం తిరిగింది!' అనుకున్నాను.

ఏదో తన ఉద్దేశాలు వెలికబోస్తానని తీసుకొచ్చి నాకు సంబంధించిన విషయాల మీద యీ నిక్కచ్చి ఏమిటీ?

"ఆ! ఏదో! అప్పుడప్పుడులెండి" అన్నాను ఓ చిరునవ్వు విసిరి.

ఆయన మొదలెట్టాడు:

"మీరు కథలురాస్తూ వాటికి మీ పేరు పెట్టకుండా, ఏమిటో 'ఏకాకి' అనే పేరుతో రాస్తారెందుకు? ఎవరో కొందరు తగినవాళ్ళు కారణాంతరాలచేత 'పెన్ నేమ్' పెట్టుకుంటే వారినిచూసి మీగ్గూడా ఎందుకండి యీ మారుపేరు? పైగా బాధగా, 'ఏకాకి' ఏమిటి?...నిక్షేపంగా ఇద్దరు పిల్లలూ, చక్కటి గులాబీలాటి భార్య వుండగా, ఈ అజ్ఞాతవాసంలోని ఆనంద మేమిటీ?—నేనిలా అడగడం మొదలెడితే మీకెంతవెర్రిగా తోస్తుందీ? నాకు అర్థంగాని ఆనందమేదో మీరు అనుభవిస్తున్నందువల్లగా మీ రా పేరులో రాస్తూంట? మీరు చూసిన కోణంనించి నేను చూడలేకపోడంచేత నేకదా ఈ చిక్కంతా? సరే, ఆ సంగతలావుంచండి.

మీరు మొన్నో కథలో ఇలా రాసినట్టు జ్ఞాపకం. 'ఈమధ్య బయలుదేరిన కుర్రకారు కాస్తనిండుగా రంగుపూలెట్టుకుని వెళ్తున్న ప్రతిస్త్రీనికూడా వీధిమలుపు చివరదాకా చూస్తారని. జ్ఞాపకముందా అలా రాసినట్టు?

"ఊఁ..." అనిమాత్రం అనగలిగాను.

"అవునండీ. ఏం? చూస్తేఏం? ఆచూపులు ఆమె శీలాన్నిగాని, మీ గౌరవాన్నిగాని,

# ★ విరుద్ధ మనస్తత్వం ★

సంఘనీతినిగాని అపహరించాయా? ఇలా అన్నానని, ప్రతివ్యక్తి కనబడ్డ ఆడదాన్నల్లా ఎగాదిగాచూడ్డం భావ్యమేనా అంటారు మీరు—దానికి సమాధానం చెప్తున్నా చెప్ప మంటారా?"

"అలాగే" అన్నాను తెల్లబోయి. అసలు ఎదురుప్రశ్నలు వేయడానికి గుండెలు లేవుగా...పావుగంట క్రితమే జారిపోయి నట్టున్నాయి. మనసులో కూర్చిపెట్టుకున్న మాటలొక్కటీ సమయానికి దొరకడంలేదు. ఖర్మ!

ఆయన మళ్లా మొదలెట్టాడు:

"ఓఅమ్మాయి...మాంఛిఅందమైన పిల్లే అనుకోండి, ఓమంచిచీర కట్టుకుని వీథులో నడుస్తూ వుంటుంది. ఎవరైనాపరాయివాళ్ళు చూస్తున్నారని తెలీగానే, అదోరకం ముఖభావం నటిస్తూంది. ఆ అమ్మాయికూడా అందరూ తననుచూసి, తన సొబగు వీక్షించాలని ఇష్టపడుతూందేమోనని మీరెప్పుడైనా ఆలోచించారా? ఆ అమ్మాయి మనస్తత్వం అన్ని పేపర్లలోనూ ఫస్టుమార్కులొచ్చిన విద్యార్థిలా వుంటుంది. ఇద్దరి మార్గాలు వేరు...గమ్యస్థానాలొకటైనా, ఇద్దరి ఆశ ఒకటే ...తమగొప్ప అందరూ గుర్తించాలని.

"లేకపోతే ఆపిల్ల అంత మంచిచీర కట్టుకుని, అంతఅందంగానలుగురిలోకివస్తుందా? కాని సిగ్గనేపరదా ఎప్పుడూ ఆవరించుకునే వుంటుంది. ఆ పరదాయే లేకపోతే పురుషునిలో అవ్యక్త మధురస్మృతులేవీ మొలకెత్తవేమో! అందుచేతే తోటిఆడవాళ్ళు ఆచీర బాగావచ్చిందంటే ముసిముసి నవ్వుల్తో విని ఆనందిస్తుంది. పురుషుని సంగతెత్తేటప్పటికి సిగ్గుతెర సంతోషాన్ని వ్యక్తపరచనీదు.

"శాస్త్రరసజ్ఞుడైన ప్రతిమానవుడూ సౌందర్యోపాసనకు పాకులాడతాడు. కాని కొంతమందిమాత్రం—బుద్ధి వక్రించి, శ్రుతిమించి: లాలసతో సౌందర్యాన్ని ఆనందించలేక హద్దులు దాటుతారు.

"ఇంకోవిషయం బజారులో అందమైన చీరల్నీ వస్తువుల్నీ బీరువాల్లోంచి చూసి ఆనందించగాలేంది...అమ్మాయి వొంటిమీద చూసి ఆనందిస్తేయేం? బీరువాల్లోంచి చూసినంత నిర్మలంగానే ఈ విషయాన్ని తీసుకోరాదూ?

"పైగా ఆ అమ్మాయి ఆచీరకుతోడు జుట్టు మనోహరంగా మలిచి చివర వదిలేస్తుంది. చీర చాలా అల్లరిగా కదుతుంది... దానికితోడు జడనిండా ఒగుప్పెడు జాజిపూలు తురుముతుంది. దీనికి కారణం ఏమిటి? ఏం? ఆ అమ్మాయి ఆపూలు పెట్టుకోకపోతే అమ్మేవాడికి నష్టమనా? లేక ఆపూల సువాసన రాణించదనా? ఏదీకాదు.

"అందమైన వస్తువుని చూచి పరవశమై ఆనందించాలనే ఆశ పురుషుడికీ ఆ అందమైన వస్తువును తనలో ఇముడ్చుకోవాలనే ఆశ స్త్రీకి ఉండడం సహజం. అంతేగాని, మీరు రాసినట్టుగా పురుషులంతా ప్రతీ ఆడదాన్నీ చూడనూచూడరు ... చూసినా - కారణంమాత్రం ఆమె తల్లోవాడిన పూలూ రంగుపూలూ మాత్రం కాదు.

"మీరు మొదట నేనన్నదాంట్లో అర్థం లేదన్నదానికి కొంచెం డొంకతిరుగుడుగా ఇదే జవాబు"

జనార్దనం ఉపన్యాసం ఆపుచేశాడు.

"ఇదేం వేదాంతమయ్యా?" అనిపించింది నాకు. పోనీ ఎదురు చెబుదామంటే తెలుగు భాషలో తెలిసినమాటలు కరువైపోయినట్టు, నాకు మాటరాదేం?

"రండిపోదాం" అని అతనే తట్టిలేపాడు. మధ్యదారిలో అతనే ఇంత కాఫీపట్టించిన తర్వాత ఎవరిదారిన వాళ్ళు పోయాం.

ఇంటికొచ్చిన తర్వాత తట్టింది—అతను అందరిమధ్యా చేసిన వ్యాఖ్యానానికీ, నాకిచ్చిన ఉపన్యాసానికీ సంబంధంలేదని ఈసంగతి రేపుసాయంత్రం అడగాలనుకున్నాను...కాని నలుగురిలోనూ కాదని అప్పుడే నిర్ణయించుకున్నాను.

రెండోరోజున అతనురాలేదు. ఆతర్వాత నాస్వంతపనులవల్ల నేను వెళ్ళలేదు. మొత్తానికి ఓపది పదిహేనురోజులు అతన్ని కలుసుకోడం పడలేదు. ఆతర్వాత అతను ఆవూరినుండి బదిలీఅయి వెళ్లిపోయినట్టు తెలిసింది.

* * *

...మళ్ళా పదేళ్ళతర్వాతమాట.

జనార్దనం రాసిన ఉత్తరం అతన్ని జ్ఞప్తికి తెచ్చింది.

"రావుగారూ,

మీకు ఇదేనా మొదటి ఉత్తరం... బహుశా ఆఖరిదేమో కూడా!

ఇప్పుడు ఎఱ్ఱటి ఆకాశం వుత్తఎఱ్ఱగానే వుంది ... ప్రియురాలి కందిన వసంతంలా లేదు..."

అంటూ ఏవిటేవిటో రాశాడు జనార్దనం.

'To every action there is always an equal and opposite reaction' అని పక్కింటి వారబ్బాయి చదువుతున్నాడు, బట్టీపట్టే ధోరణిలో.

★

బాపు భామ్మల కథ — 7



మూడో రోజున...
అదిగో భూమి! అదిగో కొండ!
అదిగో భూమి! అదిగో కొండ!




సరంగులారా! ఓడ నాపుడు—
నాపెదము—




నే నిక్కడ దిగి నా బంధువుల నొకపరి జూచి వత్తును—






హైరా! బంగారు శర్మా! నాకడనా— నీ మాయలు! ఇట ... నీ బందుగు లెవరున్నారురా!
హో హ్హో




హ!
హారినీ! నువ్వేరా! సింగార ప్పనుగా! నీ ఒళ్లు బంగారం గానూ!




ఓరే మావాఁ — నీతో వచ్చి పాత జన్మలోని మన జాయింటు పాతరలో అర వాటా తీసుకోపోతే నా ఒళ్లు బంగారమెల్లా అవుతుంది!


నమస్కార్
గ్లాడ్టూ మీట్యూ
వీరే నా జతగాండ్రు- అప్పారావు మరియు వీరాలు-


మోసం! దగా! కుట్ర! నిన్ను రాకుండా వూళ్ళోనే వుంచుతానని ఈ జతగాడు, ఓడు వచ్చి గండభేరుండంలా మూడొందలు ఎగరేసుకు పోయాండ్రోయ్ నాయనో!


నే చెప్పలే- మీ మావ బెష్టు డాన్సరని-
నిజమే గురూ యక్సలెంటు
భేష్- బచ్చినా ఒక్క వజ్రమ్ముక్క తుండా ఇవ్వాను


నేను ఒక్క వజ్రమ్ముక్క తుండా వదల్ను- నూతిలో పడే ముందు చెరి సగం వాటా అని, దగా చెయ్యనని ఒట్టేశావు గదా-


ఈ జన్మలో "ఒట్టు తీసి- గట్టున పెట్టు" అంటున్నాం గదా పాత జన్మదేది కోయ్- నీ తలకాయా నా తలకాయానూ


చూడు షావుకారూ- మర్యాదగా ఇస్తేయియ్యి వాటా- లేపోతే...
లేపోతే-


లేపోతే ఊతికేసి కప్పెట్టేస్తాం పెట్టితే శాత-


అబ్బే- ఎందుకూ- నాకు మళ్ళీ మన వూళ్ళో పనులున్నాయి


సరే కానీయండి- యాడవండి -నా మూడొందలూ తీసుకుని దాంతోటే నాకు గోయి తవ్వారు బ్రోహులారా-

# కళారహస్యం

## వల్లంపాటి వెంకటసుబ్బయ్య

"అప్పులు చెయ్యడం ఒక కళ" అనేశారెవరో! కానీ ఆ కళను సశాస్త్రీయంగా అభివృద్ధి చేసుకోలేకపోయినందుకు మనం కించిత్తు కించపడడం సహజం. సంగీతం నాట్యంలాంటి కళలమీద మోపెడు గ్రంథాలున్నాయి గదా! అప్పులు చేయడం కళని ఒప్పుకున్నప్పుడు ఆ కళమీద 'అథారిటీ' అవదగ్గ ఒక్క శాస్త్రీయగ్రంథం లేదన్న బాధ కలుగుతుంది. ఏతత్ కళమీద మానవుని పరిశోధన 1. డబ్బువున్న వాణ్ణే అడగాలి. 2. ఇచ్చేవాణ్ణే అడగాలి అన్న రెండు సూత్రాలవద్దనే ఆగిపోవడం మాస్తే యీకళ పట్ల జరిగిన నిరాదరణకు నా గుండె చెరువయిపోతోంది. ఏ కళాస్రష్టయినా యీ మహాకార్యానికి పూనుకోరాదా అనిపిస్తుంది. ఎవరైనా ఒక మహానుభావుడు ఒక మహాగ్రంథాన్ని రచించి అశాస్త్రీయంగా కళారాధన చేస్తున్న ప్రారంభకుల్ని ఆగుకోరాదా!.

మాటవరసకు చూడండి, నేనూ, శంకరం ఒకే ఆఫీసులో వుద్యోగం చేస్తున్నాం. అంటే మా యిద్దరి స్థాయి ఒకటేనన్న మాట! వాడు—ఆ శంకరం బగు లడిగితే యెవరు గానీ బదులు చెప్పరు. కానీ నేను అడుగుదామని వెళ్ళగానే, నే నడక్కముందే వారే అడిగేసి నేను అడక్కుండా చేసుకుంటారు.

శంకరం "ఏదీ బ్రదర్! ఓ పాతికరూపాయిలిలా ఇవ్వు, ఎల్లుండి ఇస్తాను" అనగానే, వాడికి అప్పు ఇవ్వడం ఒకగొప్ప అనుకొని అందరూ ఇస్తారు వాడికి.

నాకొక పదిరూపాయలు అవసరం వచ్చింది. చాల తొందరగా కావాలి. ఎవర్నడిగేది? ఎవరిస్తారు? 'డబ్బున్నవాణ్ణే అడగాలి' అని నిర్దేశించిన మహానుభావుడు, అతడిలా వుంటాడని వర్ణించి చెప్పకూడదూ? అతగాణ్ణి పోల్చుకోవడం యీ 1959 వ సంవత్సరంలో సాధ్యమా?

ఏమయినాసరే వెంకటేశాన్ని అడగాలనుకున్నాను. వెంకటేశం మా సెక్షన్ హెడ్డు. అతడు డబ్బున్నవాడిలా డాబున్నవాడుగాక, డబ్బున్నవాడు, అప్పుడప్పుడూ శంకరానికి అప్పులిచ్చేవాడు. కాబట్టి అతణ్ణే అడగాలనుకున్నాను.

నేను వెంకటేశం ఇల్లు చేరేసరికి అతడు ఒకానొక సినిమా మాగజైను చదవడంలో నిమగ్నుడై వున్నాడు. కాబట్టి అతని మానసిక ఉష్ణోగ్రత "నార్మల్"లోనే వుండవచ్చునన్న ఆశ కలిగింది.

"హల్లో! ఏమిటండీ ఇంత హఠాత్తుగా మా గృహం పావనం చేశారు," అన్నాడు వెంకటేశం టేబిలుమీదున్న పర్సుమీద పుస్తకం మూసిపెడుతూ.

"కాస్త పనివుండి వచ్చాను," అన్నాను.

"ఏమిటండీ?" అన్నాడు పుస్తకాన్ని పర్సుతోబాటు అందుకుంటూ.

"ఏమీలేగు...చిన్నపనే! ఒక పది రూపాయలు కావాలి. ఫస్టున యిచ్చేస్తాను," అన్నాను.

వెంకటేశం ముఖంలో జాలిలాంటిదేదో కనిపించింది ఆ జాలిని చూడగానే నాలో ఆశ చిగురించింది. "అయ్యో! ఎవాడూ అడగని మీరు అడిగిన యీనాడు నావద్ద లేకపోయిందే!" అన్నాడు వెంకటేశం.

నా ఆశ పేరాస అని తేలిపోయింది. నాలో నిరాశ ఆవరించుకొంది. అది నరనరాలలో దూరి గందరగోళం చేసింది. ఆ సమయంలో అప్పులుచేసే కళారహస్యాన్ని జీర్ణించుకున్నందుకు నాలో నాకు తాడెత్తు గర్వం కలిగినట్లుకూడా జ్ఞాపకం. అనగా డబ్బుగలవాణ్ణి యిట్టే పోల్చేశాను. కానీ అతగాడు నన్ను అనుగ్రహించలేదు. కాబట్టి యీ కళలో రెండవభాగమయిన 'యిచ్చేవాణ్ణే అడగటం' అన్నదే నేనిక సాధించవలసిన సమస్య.

"వెంకటేశం డబ్బుండి కూడా యివ్వనివాడు," అనలేదుగానీ అనుకుంటూ బయటపడ్డాను.

ఉషారుగా పూరికెళ్దామని ప్రయత్నించి విఫలుణ్ణయి వుసూరుమంటూ రూముచేరాను.

రెండవ దినం మధ్యాహ్నం "లంచ్ టైం"లో క్రష్ తాగి వేపచెట్టుక్రింద కూర్చున్నాను. అంతలో శంకరం ప్రవేశించాడు. వాడు కనపడగానే వాణ్ణి నమలకుండా పెప్పర్ మెంట్‌లా చప్పరించేయాలన్నంత కోపం వచ్చింది. అప్పులు చేయడంలో వాడికి గొప్ప పాండిత్యం వుంది గదా! ఆ పాండిత్యాన్ని నాకు కొస్త ప్రసాదించకూడదా? విద్య యెవరికెంతయిచ్చినా తరగదని యెవరో అన్నారు కూడా! ప్రపంచంలోని స్వార్థాన్నంతా ఒకచోట చేర్చి,

తన ఖజానాలో వున్నది కలిపి ఆ ముద్దకు ప్రాణంపోశాడా బ్రహ్మ! ఆ జీవికే 'శంకరం' అని నామకరణం చేశారా వీడి తల్లి తండ్రులు!

"ఏమిటోయ్ కొంపకాలిపోయిన వాడిలా కూర్చున్నావు?" అంటూ ఆప్యాయంగా పలకరించారు.

"ఇంకా కాలిపోలేదు," అన్నాను.

"ఇక మీదట కాలిపోయే సూచనలు కనబడుతున్నాయా?" అన్నాడు పోలీసు పోజులో.

"అవును."

"ఏమిటోయ్ సంగతి?" అన్నాడు ప్రక్కనే కూర్చుంటూ.

"సంగతులు, స్వరాలు యేమీ లేవు. ముఖ్యమైన ఒక స్నేహితుడి పెళ్ళికి ముఖ్యంగా వెళ్ళాలి. ఒక పదిరూపాయలు నీవద్దవుంటే యివ్వకూడదూ?" అన్నాను.

"ఇవ్వకూడదు!...అదిగాదురా నీ తెలివి తెల్లారిపోను. నేనేమైనా వెంకటేశాన్నా కందలు కందలు పర్సులో వుంచుకొని తిరగడానికి," అంటూ నవ్వాడు శంకరం.

'ఆ మహానుభావుణ్ణికూడా అడిగి లేదనిపించుకున్నాన్రా" అన్నాను చిరాకుతో.

"ఎప్పుడడిగావు?"

"నిన్న మధ్యాహ్నం."

"నిన్న సాయంకాలం నాకు పాతిక రూపాయలిచ్చాడే అపిసినిగొట్టు?"

తోకకు కట్టిన టపాకాయ పేలేసరికి ఉక్క యెగిరిపడ్డట్టుగా అదిరిపడ్డాను. వెంకటేశం నాకు లేదని శంకరానికి డబ్బు యిచ్చాడన్నమాట. అంటే శంకరం యీ కళలో నాకంటే గొప్పవాడని, మరొక రకంగా చెప్పాలంటే వాడికంటే నేను తక్కువని మరొకసారి నిరూపించాడన్నమాట.

"ఒరే శంకరం! ఈ అప్పులుచేసే కళలో నువ్వు గొప్పవాడివి. అనన్యసామాన్యుడివి. నన్ను నీ శిష్యపరమాణువుగా స్వీకరించు. తక్షణం ఒక పదిరూపాయలు లభించు మార్గం వుపదేశించు. గురుదక్షిణగా ట్వేడు మాటు, చక్కటి వాచి యిందులో యేదయినా ఒకటి యిస్తాను. అడ్వాన్సుగా అరకప్పు కాఫీ పోయించమంటావా?" అన్నాను వినయ వినమితగాత్రుణ్ణై.

"పోయించుము." అన్నాడు శంకరం.

ఇద్దరం కాఫీతాగాము.

"ఇప్పుడు చెప్పండి గురుదేవా! ఒకరివద్ద అప్పుతీసుకోవాలంటే యేంచేయాలి?" అన్నాను.

"ఆ మహానుభావుడికి నువ్వు అప్పుడప్పుడూ అప్పు యిస్తుండాలి," అన్నాడు సిగరెట్టుపొగ వూదుతూ.

"ఏడ్చే ముఖం కడుక్కున్నట్లుంది! చూడుసోదరా! నిత్యం మనజేబు ఖాళీ. ఇది సత్యం. అలాంటప్పుడు ఎలా యివ్వడం?" సందేహాన్ని వెలిబుచ్చాను.

"అదేరా రహస్యం! ఎవరైనా నీ జేబులో చెయ్యిమాత్రం వున్న దినం అప్పు అడిగారనుకో. అప్పుడు నువ్వు సోలెడు ఆముదం తాగిన వాడిలా "అయ్యో! నావద్ద లేదే!" అని బికారివేషంలో ముఖారి ఆలపించకూడదు. జేబులు తడుముకొని "అరె సారీ! నాపర్సు ఇంటిలో మర్చిపోయ్యాను. సాయంకాలం యిస్తాలెండి' అని రీకుగా జవాబివ్వాలి."

"ఎలాగివ్వడంరా! మనజేబులో పిల్లి పిల్లలు పెడుతుంటే?"

"అదేరా బ్రదర్ దేవరహస్యం! ఆ సాయంకాలం ఎలాగో ఒకలాగు అష్టకష్టాలు పడి డబ్బు సంపాదించి, అలా సంపాదించావన్న రహస్యం నీవద్దే వుంచుకొని ఆడబ్బు ఆ 'బ్రదర్'కు యివ్వాలి. ఆనాటితో ఆ సోదరుడు నీకు దాసుడనుకో! అతడిజేబు నీజేబులా వున్న దినం నువ్వు అతణ్ణో పది రూపాయలు అడిగావనుకో, ఆ బ్రదర్ కూడా "యింటింటి కవళం"లో నీకు డబ్బు తెచ్చి యిస్తాడు" శంకరం నెపోలియన్ పోజులో గురూపదేశం చేశాడు.

"అంతేనా? యింకా చెప్పరా!" అన్నాను వుత్సాహంతో.

"అప్పుడే అయిపోతుందా! ఇంకా పదిహేడు పర్వాలు జేబులోనే వున్నాయి. రెండవది సావధానంగా విను. జీతం వచ్చిన దినం చేబదుళ్ళు తీర్చడం తెలివి తక్కువ అన్న మాట. కాబట్టి ఎవరి వద్దకైనా వెళ్ళి ఎంత శ్రమకయినా ఓర్చి, డబ్బుచేకూర్చి, గడువుకు ముందే బాకీ తీర్చెయ్యాలి" శంకరం అన్నాడు.

"అది సరేలేరా గురూ, ఇప్పుడు నాకు ఎమర్జంటుగా, అంటే నిల్చున్న పాటున పది రూపాయలు కావాలి. అది లభించే మార్గం వుపదేశించు" అన్నాను.

"అయితే కాగితం కలం అందుకొని చెప్పినట్లు రాయి," అన్నాడు.

శంకరం ఆజ్ఞ శిరసావహించాను.

"శ్రీ...............గారికి

'ఫలానా' నమస్కారాలు.

చాల తొందరగా వూరికి వెళ్ళవలసినపని తగిలింది. బ్యాంకులో 'డ్రా' చేసుకునే వ్యవధి లేదు. కాబట్టి లేదనకుండా యిరవై రూపాయలు పంపేది.

ఇట్లు తొందరలో మీ,

"............"

ఈ చీటీముక్కను ఆఫీసు ప్యూనుద్వారా "శ్రీ..." గారికి పంపమన్నాడు శంకరం. సైకిలుమీద వెళ్ళగుని ప్యూన్ను పంపాను. పదినిమిషాల్లో తిరిగివచ్చిన ప్యూను రెండు క్రొత్త పదిరూపాయల నోట్లు నా చేతిలో పెట్టాడు. కాలు పట్టుతప్పి కూలిపోవలసిందే కాని యెలాగో కోలుకున్నాను. ఆస్ట్రియాను జయించిన హిట్లర్లా చూశాడు శంకరం. ఆనందంతో నోట్లు మడిచి జేబులో పెట్టుకోబోయ్యాను.

"తమ్ముడూ! నీకు కావలసింది పది రూపాయలేగా! ఆ మిగిలిన పది యిలా యివ్వు నాయనా!" అన్నాడు శంకరం.

"ఇదికూడా ఒక కళారహస్యమేనట్రా?" అంటూ పదిరూపాయలనోటు వాడిచేతులో పెట్టాను. పెట్టానేగానీ పట్టుమని పదిరూపాయలు కట్టుకదలక సంపాదించి టెట్టుగా జేబులో పెట్టుకుంటున్న వాణ్ణిచూచి నాలో యీర్ష్యలాంటిది కొట్టుమిట్టాడింది.

"ఇదే పదునెనిమిదో పర్వం" అన్నాడు శంకరం.

ఇద్దరం డబ్బులాగే ఆనందాన్ని చెరిసగం పంచుకొని నవ్వుకుంటూ ఆఫీసుకేసి నడిచాము.



# విజయనగరంలో రాఘవ నాటకోత్సవాలు

బళ్ళారి రాఘవుని జన్మదినం ఏప్రిల్ 16. ఏప్రిల్ 16వ తేదీనుంచి, 20వ తేదీ వరకు రాఘవనాటకోత్సవాలను విజయనగరంలో గత తొమ్మిది సంవత్సరాలుగా జరుపుతూ వస్తున్నారు. పదవ సంవత్సరం ఉత్సవాలు మొన్న ఏప్రిల్ 16నుంచి 20వరకూ జయప్రదంగా జరిగినై.

విద్యామంత్రి శ్రీ యస్ బి పి పట్టాభి రామారావు ఉత్సవాలను ప్రారంభించారు. శ్రీ పీసపాటి నరసింహమూర్తి అధ్యక్షతవహించారు.

"మనకున్న మూడు యూనివర్శిటీలకూ మూడు లలితకళలనూ నిర్వహించే బాధ్యత ఇవ్వాలని ప్రభుత్వం యోచిస్తున్నదనీ, లలితకళలను విశ్వవిద్యాలయాలలో ప్రవేశపెడితే, ఆ కళలలో ఆరితేరి రావటానికి విద్యార్థులకు అవకాశం కలుగుతుందనీ చెప్పారు. పట్టాభి రామారావు తర్వాత కూచిపూడి నాట్యాచార్యులు శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణ, పార్వతీశంగార్ల శిష్యురాలు 'నాట్యరాణి' కృష్ణకుమారి (రాయనగరం) చక్కని నాట్య ప్రదర్శనను ఇచ్చింది. ఆ రోజే ఆంధ్ర ఆర్టిస్ట్స అసోసియేషన్ (తెనాలి) వారిచే 'గయోపాఖ్యానం' నాటకం ప్రదర్శింపబడింది. శ్రీయుతులు పీసపాటి నరసింహమూర్తి, పులిపాటి, ధూళిపాళ సీతారామమూర్తి, శ్రీమతి సత్యవతి మొదలయినవారు ఈ నాటకంలో పాల్గొన్నారు.

ఆ రోజు నుంచే పోటీ నాటకాలు, నాటికలు ప్రారంభమయినై. రెండోరోజున సుప్రసిద్ధ నాటక, సినిమా రచయిత శ్రీ పింగళి నాగేంద్రరావుగారికి సన్మానం జరిగింది. నాగేంద్రరావుగారు "వింధ్యరాణి", "నా రాజు" "క్షాత్రహింసు" మొదలయిన చరిత్రాత్మక నాటకాలనూ, "ఒకే కుటుంబం" అనే చక్కని సాంఘిక నాటకాన్నీ రచించినవారు. 'గుణసుందరి కథ' 'పాతాళభైరవి' 'చంద్రహారం' 'మాయాబజార్' రాష్ట్రపతి రజతపతకం అందుకొన్న 'పెళ్ళినాటి ప్రమాణాలు' చిత్రాలకు రచన చేశారు. వీటిల్లో ఇటీవలి, 'పెళ్ళినాటి ప్రమాణాలు' చిత్రంలో వీరు చిత్రించిన పాత్రలూ, సన్నివేశాలు సంభాషణలూ మహత్తరమైనవి. నాగేంద్రరావుగారికి సన్మానం చెయ్యటం ఎంతైనా కొనియాడదగ్గ విషయం. ఈ రాఘవ నాటకోత్సవాలలో ప్రతీ సంవత్సరం ఒక ఉత్తమప్రోత్సాహిక నటుడిని కూడా సన్మానించే ఆచారం వున్నది. ప్రోత్సాహికులు పాల్గొనే ఈ ఉత్సవాలలో ఒక ఉత్తమ ప్రోత్సాహిక నటుని సన్మానించటం సమంజసమైన విషయం. అనేక పరిషత్తులలో బహుమానాలు పొందిన శ్రీ జొన్నలగడ్డ సోమయాజులుకు ఈ సంవత్సరం సన్మానం చేశారు. శ్రీ సోమయాజులు శ్రీకాకుళం నటరాజ కళా సమితికి చెందినవారు. ఈ రాఘవ నాటకోత్సవాలలో శ్రీ సోమయాజులు చాలాసార్లు బహుమతులుపొందారు. ఆయన చక్కని నటుడు. 'కన్యాశుల్కం' లో



రాఘవనాటకోత్సవాలలో "పరువుకోసం" నాటికలో నాయికగా నటించి ఉత్తమ నటిగా ఎన్నికైన ఉషాబాల

'రామప్పంతులు' గా ఆయన నటన, ఈతరంలో ఆ పాత్ర ధరించిన అందరిలోను ఆయన అగ్రగణ్యుడనిపింప చేసింది. 'కాళరాత్రి'లో 'నరహరి' గానూ 'గుమస్తా'లో 'గుమస్తా' గానూ 'పంజరం'లో 'డాక్టరు' గానూ ఆయన్ను చూసిన ప్రేక్షకులు ఆయన్ని మరిచిపోవటం సాధ్యమూ కాదు. నిండైన విగ్రహం, విగ్రహానికి తోడైన కంచుకంటి కంఠం, వాటికితోడు గొప్ప నటనాశక్తి శ్రీ సోమయాజులు సొత్తు.

ఆ రోజే ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక అకాడమీవారు ఈ ఉత్సవసంఘ అధ్వర్యాన 'భరతనాట్య శాస్త్రప్రవీణ' శ్రీ మట్నూరు సూర్యనారాయణగారికీ, 'మార్దంగికాచార్య' శ్రీ మట్నూరు సాంబయ్యగారికీ సన్మానాలు జరిపారు. శ్రీ నటరాజ రామకృష్ణ ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు. సన్మానానంతరం సన్మానితులు 'విద్య'ను ప్రదర్శించారు. ఇందులో చెప్పుకోతగ్గది - సూర్యనారాయణగారు ఒక పాటపాడుతూ, ఒకేసారి ఆ పాటకు ఐదు రకాల తాళాలను వెయ్యటం. రెండు చేతులతో రెండు, రెండు కాళ్లతో రెండు, తలతో ఒకటి వారు తాళాలను వేసి, 'తాళ విద్య'ను అపూర్వంగా ప్రదర్శించారు! మూడోరోజున "ఆంధ్రప్రదేశ్ నాట్యసంఘం-నాటకోద్యమం" అనే విషయం పై, నాట్యసంఘం ఆర్గనైజింగ్ సెక్రటరీ శ్రీ ఏ ఆర్ కృష్ణ మాట్లాడారు. నాట్యసంఘసభ్యులు శ్రీ మంత్రి శ్రీనివాసరావు అధ్యక్షత వహించారు. అనేకచోట్ల జరుగుతున్న ఈ నాటక పోటీలను సమైక్యపరిచి, క్రమబద్ధంగా ఒకేసారి ఒకేచోట జరిగేటట్లు చెయ్యాలనీ, నాట్యశాలలూ, నాటకకళాశాలలూ కావాలనీ, వాటికై సంగీతనాటక అకాడమీ కృషిచేస్తున్నదనీ అన్నారు, శ్రీ కృష్ణ.

ఐదవరోజున నాటక రచయితల, నటీనటుల, ప్రయోక్తల మహాసభ జరిగింది. ఈ సభకు శ్రీ పీసపాటి నరసింహమూర్తి అధ్యక్షతవహించగా శ్రీ ఏ ఆర్ కృష్ణ సభను నిర్వహించారు. ఈ అమెచూర్ నాటక సంఘాలకు వలసిన ధనసదుపాయాలు లేనందున, ఈ సంఘాలను 'ప్రొఫెషనలైజ్' చెయ్యాలని, సభవారు తీర్మానించారు.

ఉత్సవాల ముఖ్యకార్యక్రమం ఐన పోటీ నాటకాలు, నాటికలు ఈ ఐదు రోజులూ ప్రదర్శింపబడినవి. ఈ ఉత్సవాలలో పాల్గొనేందుకు దేశమంతటి నుంచీ మొత్తం 88 నాటకాలూ, నాటికలూ వచ్చినవి. వీటి నన్నిటినీ ప్రాథమిక పరిశీలనలు చేసి, 7 నాటకాలనూ 10 నాటికలనూ మాత్రమే ఎన్నికచేసి పోటీలకు పెట్టారు. (ఈ నాటకాలే కాక, 'హరిశ్చంద్ర ఏకపాత్రాభినయం' పోటీకూడా జరిగింది. ఐతే, ఈ పోటీలో పాల్గొన్న ఏ ఒక్కరి అభినయం కూడా బహుమతి పొందగలస్థాయిలో లేదని నిర్ణయించటంవల్ల బహుమతి ఇవ్వటం జరగలేదు) ఈ పోటీ నాటకాలలో, జెమ్‌షెడ్‌పూరు, సికింద్రాబాదు, రాయపూరు, విజయవాడ, రాజమండ్రి, కర్నూలు, విజయనగరం మొద



విజయనగరం రాఘవనాటకోత్సవాలలో "ఫణి" నాటకం ఉత్తమ ప్రదర్శనకు ప్రథమ బహుమతినందిన ఆంధ్ర నాటక సాహిత్య సంఘం, జెమ్‌షెడ్‌పూర్ (ఎడమనుంచి) కె వి శ్రీరామమూర్తి, రాధాకుమారి (ఉత్తమనటి) ఆర్. వి చలం (ఫణి), చలపతి రావు, హనుమంతరావు

లయిన చోట్ల నుండి నాటక సమాజాలు వచ్చి పాల్గొన్నవి పోటీలలో పాల్గొన్న నాటకాలకు శ్రీయుతులు గుండిమెడ వెంకటసుబ్బారావు, టి శివరామారావు ('శివం'), చెరుకూరు జోగారావు, నాటికలకు శ్రీయుతులు శ్రీనివాసచక్రవర్తి, కె వి సోమయాజులు, రావి కొండలరావు న్యాయమూర్తులుగా వ్యవహరించారు 'పోటీ ఫలితాలు' తెలిసేముందు ఏలూరు విజయ శంకర నాట్యబృందంవారు నాట్యప్రదర్శనలు ఇచ్చారు ఇందులో "పాములవాడు" అభినయం చాలాబాగుంది

ప్రఖ్యాత చరిత్రాత్మక నాటక రచయిత శ్రీ గుండిమెడ వెంకటసుబ్బారావుగారు బహుమతులను పంచిపెట్టారు

## నాటకాలు

ఉత్తమనాటక ప్రదర్శనకు జెమ్‌షెడ్‌పూరు ఆంధ్రనాటక సాహిత్య సంఘంవారు బహుమతిపొందారు వీరు ప్రఖ్య శ్రీరామమూర్తి రచించిన "ఫణి" నాటకం ప్రదర్శించారు ఈ "ఫణి" నాటకంలో 'పద్మ'గా నటించిన రాధాకుమారి నాటకాలలో 'ఉత్తమ నటి' బహుమతి పొందింది 'ఫణి' నాటకం ప్రదర్శించి రక్తికట్టించటం చాలా కష్టం జెమ్‌షెడ్‌పూరు సమాజం వారు, ఈ నాటకాన్ని చాలా కష్టపడి, అందరికీ అర్థమయ్యేరీతిలో, మొదటినుంచీ చివరిదాకా ప్రేక్షకులను 'పట్టి'వుంచే ధోరణిలో ప్రదర్శించారు ఆర్ వి చలం, చలపతిరావు, కె వి శ్రీరామమూర్తి, హనుమంతరావు, రాధాకుమారి నటించారు ప్రదర్శనకు రెండోశ్రేణిలో, కర్నూలు అభ్యుదయ కళాసమితివారి 'జన్మహక్కు' నిర్ణయించబడినది ఈ నాటకరచయిత పొట్లూరు వెంకటేశ్వరరావు (వెం. పొ) "ఉత్తమ రచన"కు బహుమతి పొందాడు ఉత్తమ నటుడుగా 'జన్మహక్కు'లో నీలకంఠం పాత్రధరించిన సోమేశ్వరరావు నిర్ణయింపబడ్డాడు తృతీయశ్రేణిలో ఆంధ్రా ఆర్టు థియేటరు విజయవాడవారు ప్రదర్శించిన "ఇన్‌స్పెక్టరు జెనరల్" వచ్చింది ఇందులో మెన్లుగా నటించిన ఆదిశేషయ్య ప్రత్యేక బహుమానం పొందాడు ఉత్తమ రంగాలంకరణకు, యమ్ వి థియేటర్స్ రాజమండ్రి వారు ప్రదర్శించిన "ఘనం"కు బహుమతి లభించింది ప్రగాసాంధ్ర నాట్యమండలి రాయపూరు వారు ప్రదర్శించిన 'సమర్పణ' నాటకంలో 'ఏకారం' పాత్రధారికి 'హాస్య నటుని' బహుమతీ, ఆ నాటకంలోనే 'రవి' పాత్రధారికి ప్రత్యేక బహుమతీ లభించాయి సికింద్రాబాదు విశ్వశ్రీ నాట్యమండలివారు ప్రదర్శించిన "ఆపద్బాంధవులు"లో మేఘాలరావు పాత్రధారికి మరొక ప్రత్యేక బహుమతి లభించింది

## నాటికలు:

ఆంధ్రా సిమెంటుకంపెనీ ఎంప్లాయీస్ యూనియన్ కల్చరల్ వింగ్, (విజయవాడ) వారు, ముదిగొండ లింగమూర్తి రచించిన 'వెంకన్న కాపురం' నాటిక ప్రదర్శించి 'ఉత్తమ ప్రదర్శన'కు బహుమతి పొందారు ఇందులో వెంకన్న పంతులు పాత్రధరించిన జి యస్ ఆర్ మూర్తి ఉత్తమ నటుడిగా నిర్ణయింపబడ్డాడు వెంకన్న పంతులు పాత్రను మూర్తి అత్యంత ప్రతిభావంతంగా—మొత్తం నాటకాలు, నాటికలు అన్ని ప్రదర్శనంలోనూ నటించిన అందరికంటె గొప్పగా—నటించాడు రెండవ శ్రేణిలో రవీంద్ర కళాకేంద్రం, కోలమూరువారు ప్రదర్శించిన 'లోగుట్టు' వచ్చింది వీరికే ఉత్తమరంగాలంకరణ బహుమతి కూడా లభించింది కాక, ఈ నాటికలో సైంటిస్టు పాత్రధరించిన మల్లాది సూర్యనారాయణకు (నాటిక రచయిత కూడ ఆయనే) ప్రత్యేక బహుమతి లభించింది 'ఉత్తమ నటి'గా 'ఉషాబాల' నిర్ణయింపబడ్డది ఈమె వి ఏ డి అసోసియేషన్ విజయవాడవారు ప్రదర్శించిన 'పరువుకోసం'లో జానకి పాత్ర ధరించింది విజయనగరం యమ్ ఆర్ యమ్ పి స్కూలు డ్రమెటిక్ అసోసియేషన్ ప్రదర్శించిన 'పెన్ను పోగొట్టిన పైన్ను'లో పిడుగుపాత్ర ధరించిన కమలాకర్ కూ, వాణీ కళామండలివారు సికింద్రాబాదువారు ప్రదర్శించిన 'దెయ్యం'లో ప్రాసిక్యూటరుగా నటించిన సి హెచ్ శ్రీరాములుకూ ప్రత్యేక బహుమతులు లభించాయి ఉత్తమ రచనకు "విముక్తుడు" నాటిక నిర్ణయింపబడ్డది రచయిత 'హితశ్రీ' కవిరాజ్ మెమోరియల్ క్లబ్ గజపతి నగరంవారు ఈ నాటికను ప్రదర్శించారు 21వ తేదీ తెల్లవారుఝామున 3గంటలకు ఈ ఉత్సవాలు పూర్తయినవి ప్రారంభోపన్యాసంలో పట్టాభిరామారావుగారు "పది సంవత్సరాలు క్రమంతప్పకుండా, అదే తేదీలకు ఉత్సవాలు జరపటం మాటలు కాదు" అని చెప్పినట్లు ఇటువంటి మహత్తర బాధ్యతను తలపై వేసుకుని ఉత్సవాలను జయప్రదంగా నడిపించిన కార్యదర్శులు వేదుల జగన్నాథరావు, యస్ అప్పారావు దొర, అన్నపూర్ణేశ్వరరావు ప్రభృతులు కడు అభినందనీయులూ, ప్రశంసనీయులూ

ఈ నాటకోత్సవాలలో కళాకారులకు బహూకరించిన రజతఫలకాలను, పాత్రలనూ చలనచిత్ర నిర్మాతలూ నటులూ విరాళంగా ఇచ్చారు వారు అనుపమ ఫిలింస్ (శ్రీ కె. బి తిలక్) చంద్రికాఫిలింస్ (శ్రీ డి కృష్ణమూర్తి) సాహితీ ప్రొడక్షన్స్,(శ్రీ డి బి నారాయణ, శ్రీ డి భావనారాయణ), శ్రీయుతులు బి ఎ సుబ్బారావు, తాతినేని ప్రకాశరావు, సముద్రాల రాఘవాచార్య, మేకప్ ఆర్టిస్టు భద్రయ్య, శ్రీమతులు జి వరలక్ష్మి, సూర్యకాంతం, కృష్ణకుమారి, మాలిని, మద్రాసు సిస్టర్స్.



# మనుగడ

## 1

వరండాలో కుర్చీలో కూర్చొని సిగరెట్టు పీలుస్తూ విచారంగా ఉన్న వినోదబాబు ఏదో ఒక నిర్ణయానికి వచ్చినట్లుగా లేచి "జానకీ" అంటూ లోపలికి వచ్చాడు.

"ఏమిటండీ" త్రాగుతూన్న కాఫీగ్లాసు చేతిలో పట్టుకొని వంటింట్లోంచి బయటికి వచ్చింది జానకి.

"కాఫీ పూర్తిచేసిరా"-వచ్చి కుర్చీలో కూలబడ్డాడు వినోదబాబు. ఇంకొక సిగరెట్టు తీసి పూర్తియైన మొదటి సిగరెట్టుతో ముట్టించాడు. రెండుదమ్ములు గట్టిగా లాగాడు. కాఫీ ముగించి వచ్చేసింది జానకి.

"ఇంకా ఏమైనా అమ్మటానికి వీలైన వస్తువులున్నాయా జానకీ ఇంట్లో ?" రుద్ధకంఠంతో అడిగాడు.

"ఇప్పుడేమంత అవసరం కలిగిందండీ ?" ఆశ్చర్య చకితురాలై అడిగింది. "అయినా ఎల్లుండేగా ఫస్టుతారీఖు ?"

"మనకు ఫస్టుతారీఖు వస్తుందంటే విచారమేగాని సంతోషమెక్కడిది ! జానకీ ! నా ఐదు సంవత్సరాల సర్వీసులో వచ్చిన జీతం వచ్చినట్లు తీసుకోటమేగాని ఒక్క నిద్రయినా చేసిందా మనయింట్లో"-పొంగి వస్తూన్న దుఃఖాన్ని ఆపుకుంటూ పలికాడు "ఇంకా మన జీవయాత్ర సాగటం దుర్లభమే వనిపిస్తోంది జానకీ !"

"ఈ రెండు రోజుల్లోనే అంత ప్రాణం మీదికి ఏమి వచ్చిందండీ !"

"ఒకటవతారీఖు రెండు రోజుల్లోనే వస్తుందని ఆశేకాని సగం బాకీలైనా తీర్చటానికి సరిపోవుగదా ఆ వచ్చే నూరు రాళ్లు!"

"కానీయండి రోజులెప్పుడూ యిలాగే వుంటాయా ?"

"ఆ ఆశతోనే జీవిస్తున్నా నింతవరకు. నిన్ననేగా అన్నయ్య దగ్గిరనుంచి ఉత్తరం వచ్చింది. యీ సంవత్సరం పంటకూడా బాకీల క్రింద జమకట్టవలసిందేనని."

"అసలు విషయమేమిటండీ యింతకు ?"

"ఏముంది ! చిల్లరకొట్టు కోటయ్య ప్రొద్దున్నే నలుగురిలో నానా మాటలన్నాడు. ధనానికి పేదలమైనా అభిమానానికి కాముగా. ఒంటరివాడిని కాదు కాబట్టి కాని లేకుంటే యీపాటికి యీ లోకాన్నించి తరలిపోయి ఉండేవాణ్ణి పరలోకానికి, అతడు కూసిన కూతలు సహించలేక."

"మీకు తెలియకుండా దాచిన వేమున్నాయి ఇంకా చెప్పండి? నా మొదటి కాన్పుకే హరించుకుపోయింది నా మూడు పేటల చంద్రహారం. పిల్లవాడు బ్రతికి బయటపడటానికి ఖర్చయినాయి పెళ్ళినాడు

**కె. జయ**

మీకు పెట్టిన వెండిచెంబు, పళ్ళెము. పెళ్ళినాడు మిత్రులు చదివించినవి వెండిగ్లాసుల దగ్గరనుంచి కుంకుమ భరిణెలవరకు రెండవ కాన్పుకు పూర్తిచేశాము. ఇక మిగిలిందొక్కటే... మం...గ...ళ..సూ..త్రం."

ఇక మాట్లాడలేక పోయింది జానకి. వెల్లువగా పొర్లి వస్తూన్న దుఃఖాన్ని ఆపుకోటానికి చీరచెరుగు నోట్లో కుక్కుకుంటూ వెళ్లింది వంటింట్లోకి. ఆపుకున్నా ఆగకుండా ధారాపాతంగా వస్తూన్న కన్నీటిని తుడుచుకుంటూ దిగాలుపడి చూస్తూ కూర్చున్నాడు వినోదబాబు.

## 2

వినోదబాబు లేనికుటుంబంలోనివాడు కాడు. తండ్రి జానకిరామయ్య, తల్లి పార్వతమ్మ. వీరికి యిద్దరు కుమారులు, ఒక్కతే కుమార్తె. తండ్రి యిచ్చిపోయిన మూడెకరాల మాగాణీని ఆరు ఎకరాలు చేశాడు జానకిరామయ్య కృషితోపాటు తెలివితేటల్నికూడా ఉపయోగించి, పెద్దవాడు తండ్రికి చేదోడువాదోడుగా వ్యవసాయపు పనులలో సాయపడుతూ ఇంటివద్దనే ఉంటున్నాడు భార్యాబిడ్డలతో. కుమార్తెకు ఒక ఎకరం కట్నంయిచ్చి వైభవోపేతంగా జరిపించాడు వివాహం. చిన్నవాడు వినోదబాబుకు బి. ఏ. దాకా చదువు చెప్పించాడు.

బి. ఎ. చదువుతూన్న రోజుల్లోనే ఒక పర్యాయం బంధువులయింటికి పెళ్ళికి వెళ్ళాడు వినోదబాబు. ఆ వివాహానికి వచ్చిన జానకి తల్లిదండ్రులతో పరిచయమైంది. జానకి అప్పుడు స్కూలుఫైనల్ క్లాసు చదువుతూవుంది. జానకి తండ్రి రాఘవయ్యది తిండికష్టకు లోటులేని కాపురం. వ్యాపారంలో బాగానే ఆర్జించాడు. ఆయనకు ఒక కుమారుడు, ఒక కుమార్తె. కుమారుడు రామారావు ఐ. యల్. టి. డి. కంపెనీలో ఉద్యోగం చేస్తున్నాడు. జానకి అందమయిన పిల్ల. ఆమె అందచందాలు, విద్య, వినయ విధేయతలు, వినోదబాబును ఆకర్షించాయి.

కుమారునికి మనుమరాలిని వివాహంచేయాలని సంకల్పించారు జానకిరామయ్య, పార్వతమ్మలు. కుమార్తె వత్తిడివల్ల కొంత, ఆస్తి వస్తుందని ఆశతో కొంత ఆ అభిప్రాయం నిశ్చితమై కూర్చుంది వారి మనస్సుల్లో. పిల్ల చిన్నదికావడం, విద్యావిహీనురాలుకావడం కారణంగా ఆమెను వివాహమాడ తిరస్కరించాడు వినోదబాబు. అనేకవిధాల ప్రయత్నించారు తల్లిదండ్రులు, అన్నగారుకూడా. గత్యంతరంలేక చివరకు జానకితోనే వివాహం జరిగింది వినోదబాబుకు, తలిదండ్రులకు పూర్తిగా యిష్టంలేకపోయినా. తత్ఫలితంగానే ఏదైనా ఒక ఉద్యోగం చూచుకుని తన కాళ్ళపై తాను నిలబడవలసివచ్చింది వినోదబాబుకు. ఎలాగైతేనేం ఎలక్ట్రిసిటీ డిపార్టుమెంట్‌లో ఉద్యోగం సంపాదించి భార్యతో కాపురంపెట్టాడు బస్తీలో. సంవత్సరం తిరగకపూర్వమే ఆకస్మికంగా మరణంచెందాడు జానకిరామయ్య. ఐదువేల రూపాయలు అప్పుచూపించాడు అన్నగారు.

ఇటు రాఘవయ్య కుటుంబంకూడ వ్యాపారంలో బాగా దెబ్బతినడంవల్ల ఆర్జించిన ఆస్తిపాస్తులు హరించుకుపోయాయి కర్పూరంలా. ఆ దిగులుతోనే జీవయాత్ర ముగించాడు రాఘవయ్య. తల్లి పేరుమీదఉన్న పది

వేలు ఇన్నూ గెన్నూ తప్ప వేరే ఆస్తి లేదు. ఆమె కూడా సంవత్సరం క్రితమే పరలోకయాత్ర చేసింది క్షయవ్యాధితో. 'కష్టాలన్నీ కలిసి కట్టుగా వస్తాయి' అనే సామెతకు యింకేం కావాలి నిదర్శనం!

## 3

ఇటు అన్నగారినుంచిగాని, అటు అత్తగారినుంచిగాని ఏ విధమైన సహాయం లేకపోవడం, వచ్చే జీతం పొట్టగడవడానికే చాలకపోవడం, అవస్థలపాలయ్యాడు వినోదబాబు. ప్రతి కాన్పుకు భార్యగండం గడిచి బయటపడటం, రోగాలతో పిల్లల ఆరోగ్యం సరిగా ఉండకపోవడం, రుణాలకూ మాపులకూ భరించలేక సతమతమవుతూ జీవయాత్ర సాగిస్తున్నాడు అల్లిబిల్లిగా అలుముకుపోతున్న అవస్థలు తిట్టుకుంటూ. భార్యకు మరల కనేరోజులు

"వంటయింది, లేవండి." భావనా ప్రపంచంలో కొట్టుమిట్టాడుతూన్న వినోదబాబు వాస్తవ జగత్తులోకి వచ్చాడు జానకి పిలుపుతో, పరధ్యానంగా భోజనం పూర్తి చేశాడు.

పరిస్థితి సవగాహన చేసికొన్న జానకి అబ్బాయి బంగారు గడియారం అమ్మి బాకీ తీర్చండి, రోజులు కలిసివస్తే మరల చూడవచ్చు" అన్నది.

"ఏమండీ! మనం మన పద్ధతులు కొన్ని మార్చుకుంటే సంసారం యింత యిబ్బంది పడవలసినఅవస్థ తటస్థించదేమో?" అన్నది తానెప్పటినుంచో ఆలోచించిన విషయాన్ని వెలిబుచ్చుతూ.

"ఏమిటది జానకీ?" ఆత్రుతతో అడిగాడు.

"మనకు కాఫీఖర్చు నెలకు పదిహేను రూపాయలైనా అవుతుంది. మీ సిగరెట్లు, సినిమాలు, స్నేహితులతో విందులు వగైరా వీటిని మానగలిగామంటే నెలకు పాతిక రూపాయలు మిగల్చగలిగినవారమౌతాము. మేమో ఆలోచించండి."

"నిజమే జానకీ, నీవు చెప్పినది. కాని దానిని ఆచరించగలమంటావా?"

"నాకు ధైర్యముంది. మీరే ఆలోచించాలి."

"సరే ఈరోజునుంచే వాటిని అమలు జరుద్దాం."

భోజనం ముగించుకొని ఆఫీసుకు చేరుకున్నాడు వినోదబాబు. మధ్యాహ్నం 'లంచికి వెళ్తూన్న తోటిగుమాస్తాలతో లేవబోయి మరల కూర్చున్నాడు భార్య చెప్పిన సలహా గుర్తుకువచ్చి. మనసులో అంతర్యుద్ధం ప్రారంభమైంది. చేయవలసినపని చేయలేకపోతున్నాడు. కొన్ని సంవత్సరాలనుంచి పాతుకుపోయిన అలవాట్లను ఒక్కమారుగా కూకటివ్రేళ్లతో పెకలింపలేక బాధపడుతున్నాడు.

"ఈ ఒక్కపూట త్రాగితే కాఫీ?"

# ★ మనుగడ ★

"ఛా! ఏమైనాసరే దానిని ముట్టకూడదు. కిటికీనుంచి లోపల ప్రవేశించిన సిగరెట్టు పొగ నాసికారంధ్రాలలో ప్రవేశించి కలవర పరిచింది. ఈసమయంలో ఎవరైనా మిత్రుడున్నావస్తే బాగుండును కనీసం ఆయన బలవంతంచేశాడు కాబట్టి త్రాగాను అని యైనాకొంత తృప్తిపొందవచ్చు, తన నిర్ణయానికి స్వస్తి చెప్పావనే బాధకలుగకుండా.

చెడుకు సహాయపడినట్లు భగవంతుడు మంచికి సహాయపడడనడం నూటికి నూరుపాళ్లు నిజం. అతనికోరిక కనుగుణంగానే బావ రామారావు రానేవచ్చాడు చాలాకాలానికి చెల్లెలినిచూచి పోవాల. మానుకుందామనుకున్న కాఫీ, సిగరెట్లు మరల సాగాయి మూడురోజులు బావగారిపేరుతో. మరునాటినుంచి పిల్లకు జ్వరం. తప్పలేదు కాఫీ పదిరోజులపాటు. 'నష్ట జాతకునికి కష్టాలు కాకపోతే కలుగుతాయా సుఖాలు!

## 4

మరల ప్రారంభమైంది జీవితంతో పోరాటం. సాయంత్రం ఆఫీసునుంచియింటికి చేరాడు వినోదబాబు. అద్దెబకాయి కోసం నీచంగా మాట్లాడాడుయింటి యజమాని. పాలు పెరుగులవాళ్లు బాకీలకై రభస చేశారు ఉదయాన్నే. చిల్లరమల్లర బాకీలవాళ్ల సంగతి వేరే చెప్పవలసిన పనేలేదు. జీవితమే ఒక బాకీఅయిపోయింది వినోదబాబుకు. మూడునాళ్లనుంచి దాదాపు పస్తులే జరుగుతున్నాయి. గతమంతా కళ్లముందు నాట్యం చేస్తూంది. కనిపించినవారినెల్లా అడిగి విఫల మనోరథుడైనాడు. "ఏదో ఆవేదన కొద్దీ అడగడమేగాని, ఎవరిస్తారు? తెచ్చిన బాకీలు తీరితేనేగా! ఎరుగనివారు ఎటుతిరిగీ యివ్వరు కనీసం తాకట్టుఅయినా లేందే. ఎరిగినవారు అసలే యివ్వరు పరిస్థితి వారికి తెలుసు కాబట్టి." అన్నది అంతరాత్మ. కొండంత ఆశతో వెళ్ళాడు అన్నదగ్గరకు. అవమానంతో తిరిగివచ్చాడు, భార్య నిండు చూలాలు. ఆమె కాన్పువిషయం తలుచుకుంటే గుండె చెరువవుతూ ఉన్నది. పసిపిల్లకు తీవ్రమైనజ్వరం. డాక్టరిచ్చిన ప్రిస్క్రిప్షన్ జేబులో భద్రంగా వున్నది.

పరిస్థితుల ప్రాబల్యం పెత్తనం చెలాయించసాగింది వినోదబాబుపై. తాను బ్రతికివుండి కుటుంబం పడే బాధలను చూస్తూవుండటం దుస్సహమనిపించింది. తండ్రి లేని బిడ్డలనే భావంతోనైనా యీ లోకం పిల్లలను ఆదరించక పోతుందా తాను గతిస్తే అన్న నిర్ణయానికి వచ్చాడు. జీవితంలో తుదిఘడియలు సమీపించినట్లు బాధపడసాగాడు. అగ్ని పర్వతం బ్రద్దలు కాబోతున్నట్లుంది మనస్సులో. చుట్టుప్రక్కల వాళ్ళంతా చేరి వికటాట్టహాసం చేస్తున్నట్లుంది మనోవీధిలో. క్రూర దృష్టులతో భస్మీపటలం చేస్తున్నారు అప్పుల వాళ్ళంతా భావనా ప్రపంచంలో. మృత్యుదేవత తనకరకుహస్తాలతో ఆలింగనం చేసుకోబోతూన్నది దృష్టిపథంలో. పెనుతుఫాను చెలరేగింది. కూర్చున్నవాడు అమాంతను లేచి బయటికి వెళ్ళాడు. మందులషాపు చేరుకున్నాడు.

పసిపిల్లల ప్రాణాలనైనా రక్షించాలనే దీక్షతో ఇత్తడిబిందె తాకట్టుపెట్టి ఆపూటకు కావలసిన ఏర్పాట్లు చేసింది జానకి. పిల్లలను నిద్రపుచ్చి భర్తకోసం వేచి వేచి, నిదురించింది—తీరని కష్టాలను తలచుకుంటూ.

## 5

రాత్రి పొద్దుపోయి ఇంటికిచేరాడు వినోదబాబు. 'నాన్నా' అంటూ కాళ్ళను పెనవేసుకుంటున్నట్లగుపించారు—అశుభం శుభం తెలియని అమాయకులైన ఆ అర్భకులు.

"ఏమండీ! నన్నూ నా పిల్లలను నట్టేట్లో ముంచుతారా? బ్రతికుంటే బలుసాకైనా తిని జీవించవచ్చు. అంత సాహసానికి తలపడకండి," అంటూ కన్నీరు మున్నీరుగా దుఃఖిస్తూ తనను వారిస్తున్నట్లగుపించింది భార్య. నిద్రిస్తున్న వారివైపు చూచాడు ఒకసారి. దృఢ నిశ్చయం సన్నగిలసాగింది. ముఖాన్ని ప్రక్కకు తిప్పాడు. భార్యాబిడ్డలు ఆకలితో అలమటించుతూ వీధులవెంట తిరుగుతున్నట్లు కన్పించారు. ప్రతివారు తిట్టి తరిమేస్తున్నట్లు కన్పించారు. "ఛీ! నా కష్టాలు బాపుకోటానికి వారిని కష్టాలపాలేయుటమా? కాదు, కాదు. వారినే యీ కష్టాలనుంచి శాశ్వతంగా విముక్తుల్ని చేస్తాను." స్థిరసంకల్పంతో వారిని సమీపించాడు. స్వప్న జగత్తులో అమందానందాన్ని చూరగొంటూన్న పసికందుల ముఖబింబాలు, తల్లిగర్భంలో చిరునవ్వులతో కేరింతాలు కొడుతూన్న పసిపాప, కష్టసుఖాలు కాచి వడబోసిన కరుణామృతాన్ని చిందించే యిల్లాలి వదనం మార్పుకొన్న నిశ్చయాన్ని మరల మొదటికి చేర్చాయి.

భద్రంగా జేబులో దాచిన మందుపొట్లం బయటికి తీశాడు. గ్లాసులో నీళ్ళలో కలిపాడు. 'ప్రభూ! నా కుటుంబాన్నైనా కష్టాలపాలు గాకుండా కాపాడు' అంటూ భగవంతుణ్ని కడసారిగా ప్రార్థించాడు. 'రా నాయనా! ఇంకా జాగు చేస్తావేం?' అని కరుణహస్తాలతో పితృదేవతలు ఆహ్వానిస్తున్నారు. గ్లాసందుకొన్నాడు కంపిత హస్తాలతో. క్షణక్షణానికి వికలమైపోతున్న హృదయాన్ని రాయి చేసుకున్నాడు. తన కష్టాలు శాశ్వతంగా తీరిపోతున్నవి. మృత్యుదేవత తన నానందంతో కౌగలించుకోబోతున్నది. గ్లాసును ముద్దాడబోతున్నాయి పెదవులు. పాపం, వాటికేం తెలుసు, అది హాలాహలమని

"వినోద బాబుగారూ!" బయటి నుండి పిలుపు. చలించిన హృదయాన్ని సరి చేసుకున్నాడు. వెంటవెంటనే పిలుపులు రాసాగాయి బయటినుంచి. ధైర్యం సడలిపోయింది వచ్చి తలుపు తెరిచాడు.

"వినోదబాబు గారు మీరేనా? టెలిగ్రాం వచ్చింది" అన్నారు. వణకుతూన్న హస్తాలతో సంతకం చేసి తీసుకున్నాడు. చెదిరిన హృదయంతో చించాడు.

"జానకితో వెంటనే బయలుదేరి రావాలి. అమ్మతాలూకు ఇన్నూరెన్ను పైకం రేపే' కోర్టులో తీసుకోవాలి."—'రామారావు'

కలా! నిజమా! కేకలకు నిద్రనుండి లేచిన జానకి నీరసంగా బయటికి వచ్చి 'ఏమిటండీ' అన్నది.

"నీవు కలలు గన్న మంచిరోజులు వచ్చాయి జానకీ!" అన్నాడు వినోదబాబు సంతోషంతో.







# ఆంధ్ర మహాభారతము

## ఆదిపర్వము - సప్తమాశ్వాసము

సీ. తా నొక్క మునికన్య దనకర్మవశమునఁ, బతిఁ బడయంగ నోపక యుపేత
దౌర్భాగ్య యై ఘోర తప మొనరించిన, దానికి శివుఁడు ప్రత్యక్ష మయ్యి
వేఁడుము వర మన్న వేడ్కతోఁ బతిదాన, మని యేనుమాఱు ల య్యబల వేఁడె
నట్లేని నీకు దేహాంతరంబునఁ బతు, లగుదు రేవురు పరమార్థ మనియు

ఆ. హరుఁడు కరుణ నిచ్చె నది యిప్డు పాంచాల, పతికిఁ గృష్ణ యనఁగఁ బంకజాక్షి
యుద్భవిల్లి పెరుఁగు చున్నది తత్స్వయం, వరము సేయుచున్న వాఁడు వాఁడు.

క. ఇల నర్ధరాత్రమును సం, ధ్యలు రెండును భూతయక్ష దానవగంధ
ర్వుల త్రిమ్మరియెడు ప్రొద్దులు, వెలయఁగ నిం దవనిచరులు వెఱతురు నడవన్.

వ. మీరు ద్రుపదుపురంబునకుఁ జక్కనరుగునది యందు మీకు లగ్గగునని చెప్పి కృష్ణద్వైపాయనుం డరిగినఁ బాండునంద నులు జననీసహితం బనవరతంబు రాత్రులుం బగళ్లును బయనంబు వోవుచు నొక్కనాఁ డర్ధరాత్రంబున గంగయందు సోమశ్రవం బనుతీర్థంబున స్నానార్థులై యర్జునుండు ప్రకాశార్థంబును రక్షణార్థంబునుంగా నొక్కకొఱవి సేతఁ బట్టుకొని ముందఱం బోవ నందఱునరుగునెడ నంగారపర్ణుం డను గంధర్వుం డంగనాసహితంబు గంగకు నంతప్రొద్దు జలక్రీడార్థంబు వచ్చినవాఁ డప్పాండవులపాదధ్వని విని యలిగి విల్లు గొని గుణధ్వనిఁ జేసి వారి కిట్లనియె..

## అర్జునుఁ డంగారపర్ణుని జయించుట

వ. ఇవ్వేళలయందు గ్రుమ్మరియెడువారి నెంత బలవంతులనైనను రాజులనయినను నిగ్రహింతుము నన్ను డాయకుం డెడగలిగి పొం డేనంగారపర్ణుం డను గంధర్వుండఁ గుబేరుసఖుండ నెప్పుడు నిందు విహరించుచుండుదు నన్నెఱుంగరె యివ్వనంబును గంగాతీరంబును నంగారపర్ణంబులు నా జగద్విదితంబులు దీని మానవులు రనోడుదు రొరవిన వావి కర్జునుం డిట్లనియె.

క. నడురేయి సంధ్యలందును, నడవఁగ నోడుదు రశక్తనరు లోరులు భయం
బడుదురె యే మెయ్యెడ న,ప్పుడు నడతుము యధికశక్తి పురుషుల మగుటన్.

క. అడవులు నేఱులు నవి నీ, పడసినయవియట్టె పుణ్య భాగీరథి యి
ప్పుడమిఁ గలజనుల కెల్లను, నొడపక సేవ్యంబ కాక యిది నీయదియే.

సీ. హైమవతోత్తుంగ హేమశృంగంబున, నుండి భూమికి వచ్చి యుదధిఁ గూడె
గంగ నా నేడు దెఱంగుల నదియు మం, దాకిని నా నభ్రపథంబునందు
సురసిద్ధమునివియచ్చరసేవ్య యయ్యె న, య్యురగలోకంబున నొనర భోగ
వతి యన నొప్పు చున్నతి నిట్లు త్రిభువన, పావని యైన యి ప్పరమమూర్తిఁ

ఆ. బార్వతీశమకుటబంధబంధురతరా, వాస గంగ నాడ వచ్చి నీవు
వలవ దనిన నుడుగు వారము గాము నీ, విఘ్నవచనములకు వెఱతు మెట్లు.

వ. అని జననీభ్రాతృ సహితుండయి గంగా,భిషేకార్థంబు చనుదెంచునయ్యర్జును పై నంగారపర్ణుం డతినిశితసాయకంబు లేసిన నర్జునుం డలిగి తనచేతికొఱవి విదిర్చి యయ్యమ్ములు దన్నుం దాఁక కుండం గాచికొని వాని కిట్లనియె.

ఆ. వెడఁగ యిట్టిపాటి వెఱపించుటలును మా,యలును నేమిసేయు నస్త్రవిదులఁ
బెక్కు లయ్యు నీబిభీషికల్ నుఱువులు, విరియునట్టు లిందు విరియఁ జూవె.

సీ. అగ్ని దేవుండు బృహస్పతి కిచ్చె ము,న్నతఁడు భరద్వాజుఁ డనఁగఁ బరఁగు
ముని కిచ్చె నమ్మహాముని భార్గవున కిచ్చె, భార్గవుండును గుంభభవున కిచ్చె
నమ్మహాత్ముండు నా కతిదయ నిచ్చెని,య్యనలాస్త్రమని దాని నమ్మహోగ్ర
గంధర్వుపై వైచె ఘనుఁ డింద్రసుతుఁ డంతఁ, దద్రథంబప్పుడ దగ్ధమయిన

ఆ. నగ్నిదాహభీతి నంగారపర్ణుండు, బమ్మరిల్లి నేలఁ బడిన వానిఁ
గొప్పవట్టి యీడ్చికొనివచ్చె ధర్మజు,కడకు నింద్రసుతుఁడు కడిమి మెఱసి.

క. వానిమనోవల్లభ కుం,భీనసి యనునది గరంబు భీతి నశేషో
ర్వీనాథులార దయఁ బతి,దానము నా కిందు మీకు ధర్మువు పెరుఁగున్.

క. అని యఱచుచున్న దానికి, ననఘుఁడు గరుణించి పాండవాగ్రజుఁ డయ్య
ర్జునుఁ జూచి వీని విడువుము, యని నోడినవాని హీను నయశోపేర్యన్.

ఆ. అనిన నరుఁడు వల్లె యని వాని కనియె గం,ధర్వ నిన్నుఁ గరుణ ధర్మరాజు
గురుకులేశ్వరుం డశరణశరణ్యుండు, విడువఁ బనిచె నింక వెఱవకుండు.

వ. అని వాని నాశ్వాసించి మందల విడిచిన నట్లు నిర్జితుండై యర్జునున కంగారపర్ణుం డిట్లనియె.

మ. అని నీచేతఁ బరాజితుండ నయి నా యంగారపర్ణత్వ మిం
కను దాల్పంగ మది నంత నిర్లజ్జుఁడనే గర్వం బడంగంగ రణం
బున ము న్నోడియుఁ బూర్వనామమునఁ బెం పుగ్ర గర్వముం దాల్చువాఁ
డనఘా సత్సభలందు మెచ్చఁబడునే హాసాస్పదీభూతుఁ డై.

వ నీయాగ్నేయాస్త్రంబున దగ్ధరథుండ నయ్యును గంధర్వమాయ ననేక రత్నవిచిత్రంబైన రథంబు వడసి యిది మొదలుగాఁ జిత్రరథుండ నయ్యెద నీపరాక్రమంబునకు మెచ్చితి నీతోడిసఖ్యంబు నా కభిమతంబయినయది నాతపంబు నం బడయంబడిన చాక్షుషి యను విద్య నీకిచ్చెద దీనిం దొల్లి మనువలన సోముండు వడసె సోమునివలన గంధర్వపతి యయిన విశ్వావసుండు వడసె నాతనివలన నేను బడసితి నెవ్వండేని మూఁడులోకంబులం జూడ నిచ్చగించు నాతండుదనయిచ్ఛకుం దగ నివ్విద్యపెంపున సర్వంబునుం జూచు నేము దీనన చేసికాదె మానవులకు విశేషుల మై వేల్పులచేత శాసింపంబడక జీవించెద మిదికాపురుషప్రాప్తంబై ఫలియింపదు నీవు తాపత్యవంశవర్ధనుండవు మహాపురుషుండవు నీకు సఫలంబగు నీ దివ్యవిద్య గొను మిచ్చెద దీనిఁగొనునప్పుడు షాణ్మాసిక వ్రతంబుసేయవలయు నీవు నాకు నాగ్నేయాస్త్రంబిచ్చునది మహాజవసత్త్వంబులఁ గామవర్ణంబులఁ గామగమనంబుల నైన గంధర్వహయంబుల మీకేవురకుం జెఱునూఱేసి యిచ్చెద.

సీ. వృత్రుపై గీర్వాణ విభుఁడు ముక్త వజ్రంబు, వైచిన నది వాని వజ్రకఠిన
పటుమస్తకంబునఁ బడి పాతరయమునఁ, బదివయ్యలైనఁ దద్భాగచయము
క్రమమున బ్రాహ్మణ క్షత్త్రియవిట్శూద్రుల,యందు వేదంబును నాయుధమును
హాలము శుశ్రూషయు నయ్యె వజ్రంబున, వాహంబులందు జవంబునయ్యె

తే. నట్టిజవమున నభిమతం బగుచునున్న; యట్టిహయసమూహంబయ్యెయ్యవనిపతుల
కఖిలభువనముల్ రక్షించు నపుడు సకల,సాధనములలో నుత్తమ సాధనంబు.

వ. అనిన వాని కర్జునుం డిట్లనియె.

ఆ. ఎంతమిత్త్రులైన నెన్నండు నొరులచే, విద్యయును శ్రుతంబు విత్తచయముఁ
గొనఁగ నొల్ల నాకుఁ గూర్తేని ననలాస్త్ర,మనఘ నీవుగొనుము హయములిమ్ము.

వ. నీతోడ బద్ధసఖ్యంబుఁ జేసెద మఱి మమ్ముఁ బరమధార్మికులం బరమబ్రహ్మణ్యుల నేమికారణంబున నుదిరి పలికి తవిన గంధర్వుం డిట్లనియె.




ఉదయ కిరణాల బంగారు కాంతులు ప్రజ్వలమయి, ఉషస్సులో తడిసి అద్దు తగిలే చెట్ల ఆకులను దూసుకుంటూ, ప్రపంచాన్ని అన్వేషించాలన్నట్లు, సర్వవ్యాప్త మౌతున్నాయి. ఆ కిరణాల కాంతుల్లో నల్లత్రాచుల్లా పరుచుకు సమాంతరంగా పరుగిడుతున్న రైలు పట్టాలు నిగనిగలాడుతున్నాయి. కనుచూపుమేర చివరలో తాత్కాలికంగా కలుసుకున్నట్లున్న ఆ రైలు పట్టాలు జీవితానికి గమ్యం తెలియక సతమత మవుతున్న యువకుడి గమనంలా భూమిమీద చుట్టుకున్నాయి. చుట్టుకున్న పట్టాలపై యౌవనపు ఉద్రేకాల్లా చక్రాల శబ్దాల గడిబిడలతో, ఉత్సాహంగా కూత కూస్తూ, భవిష్యత్తులో బరువుగా వేలాడుతున్న సంవత్సరాల్లా పెట్టెలతో, జీవితాన్వేషణకై బయలుదేరిన యువకుడి గుండెలా దడదడలాడుతూ క్రమతో రైలు వేగంగా పరుగిడుతోంది. ఎర్రరాతి గుట్టలతో, పర్ర భూములతో, ఎత్తు పల్లాల కొండలతో, మేకుల్లా నిలుచున్న తాటిచెట్లతో చుట్టు ఆవరించుకొన్న ఆ ప్రకృతి పరుగుతే రైలు బండికి దారియిస్తూ సగౌరవంగా తప్పుకుంటోంది.

శివరాం రైలుపెట్టె కిటికీలోంచి తొంగి చూస్తూ ఆలోచించాడు. అతని జీవితానికి, రైలుగమనానికి ఎన్నో పోలికలు కనిపించాయి. హఠాత్తుగా బయలుదేరిన ఆ ప్రయాణం జీవితంలోని ఏ అంతరార్థాలు బుజువు చేస్తుందో! దూరంగా ఉన్న ఒక క్రొత్తనగరంలో, ఎరుగని మనుష్యుల సాంగత్యంలో క్రొత్తజీవితం దిద్దుకోవాలనుకున్న ప్రయత్నం ఏమౌతుందో! పురాతన సంప్రదాయాల భావాల బంధాల్లో పాతుకుపోయి తుప్పుపట్టిన మనస్సుకు ఒరిపిడి పెట్టాలనే వాంఛ, ఆశించిన ప్రేమ దూరమవగా అలముటించి కరుడుగట్టిన హృదయానికి ఉపశమనం కలిగించి గతం మరవాలనే బాధలకోరిక, ఒకరూపం పొందుతాయా? సముద్రంలో పడిన మనిషి బలవంతంగా యీత నేర్చుకోవలసిన విధంగా, క్రొత్తపరిసరాలలోకి కాలు పెడుతున్న తానుకూడ బలవంతంగా మేధాశక్తిని వుపయోగించి ఒక క్రొత్త బ్రతుకు కల్పన చేసుకోవలసి వస్తుంది.

ఎండి మోడైన చెట్లు కొత్తగా వేసిన చిగురుటాకులు ప్రొద్దు ఎండలో తళతళ మెరుస్తున్నాయి. మామిడిచెట్టు నొకదాన్ని మాధవీలత అల్లుకొనటానికి ఎగబ్రాకుతోంది. అప్పుడే రెక్కలు వస్తున్న ఒక పిచికపిల్ల ఎగరడానికి తల్లి దగ్గర పాఠాలు నేర్చుకుంటోంది ఒక ఈతచెట్టుపైనున్న గూడులో. రైలుకట్ట క్రింద తుప్పల్లో మొలిచిన చిన్న గడ్డిపూలు చిలిపిగా ఆనందంగా నృత్యం చేస్తున్నాయి భవిష్యత్తు కలలతో. కాయలు నన్నట్లు, గర్భవతియైన స్త్రీలా గర్వంగా, గంభీరంగానిండుగా కనిపిస్తోంది. టెలిఫోను తీగల మీద పాలపిట్టలు నీలం తోకలు చూపిస్తు శుభాకాంక్షలు తెలుపుతున్నాయి. పాలమ్మి బ్రతికే గ్రామీణులు ఆవుల మందను పచ్చిక కోసం తోలుకువెడుతున్నారు. రైలు గమనములో తిరిగిపోతున్న ఆదృశ్యాలు, వేడెక్కిన మెదడు కలవరిస్తున్న ఆలోచనలా కదిలి అదృశ్యమైపోతున్నాయి.

అన్వేషించినకొలది జీవితంలో కలిగే అనుభూతులతో, తారసిల్లే విచిత్ర వ్యక్తులతో జగతి ఎంత రక్తిమయం అవుతుంది! అంగుకే ఒకొక్కసారి అనిపిస్తుంది—కలకాలం జగతిలోనే బ్రతుకు హాయిగా గడపాలని. జగతిలో విచిత్రమైన యాత్ర జరుపుతున్న యాత్రిక వీరుడిలా శివరాం ఆలోచనలతో ఒక మందస్మితం చేశాడు.

ఆ మూడవతరగతి రైలు పెట్టె దేశంలోని బీదప్రజల మ్యూజియమ్‌లా అగుపడుతోంది. నిద్రలేచి ముఖాలు కడుక్కొన్న ప్రయాణికుల శరీరాల్లోంచి గతరాత్రి మెతక వాసనలు వెలువడుతున్నాయి. రైలు బొగ్గు మెరకలు రాలిపడిన బెంచీల సంపర్కముతో నలుపై మాసిన ప్రయాణీకుల దుస్తులు బద్ధకస్తుల గతి జ్ఞప్తికి తెస్తున్నాయి. ఒక విద్యార్థి హాల్డాలు పరుచుకొని ఏదో నవల పఠిస్తున్నాడు. భార్యా పిల్లలతో ఉన్న ఒక సంసారి, సామానులు లెక్కపెట్టుకుంటున్నాడు—నిద్రలో ఏమీ దొంగిలింపబడ లేదుగదా అని. తెలంగాణా గ్రామీణరైతు ఒక చుట్ట ముట్టించాడు. బెజవాడకు ముందు పలికే తెనుగుభాష మారిపోయి, ఉర్దూ మిశ్రమంతో, మాటచివర "హై" లతో పెట్టె సందడిగా, రైలు గమనానికి ఊతపదాల్లా తయారయ్యింది. భార్యాభర్తలు వొక మూల కూర్చుని సరసంగా గృహ విషయాలు ముచ్చటించుకుంటున్నారు. క్రొత్తగా హైద్రాబాదుకు వస్తున్న ఒక

వింతలు, విశేషాలు వివరిస్తున్నాడు. విడ్డూరంగా. కాషాయ వస్త్రాలు ధరించిన ఒక విరాగి ఉదయ సూర్యుణ్ణి ధ్యానిస్తున్నట్లు నిమీలిత నేత్రుడయ్యాడు. ఒక బిడ్డల తల్లి రైలు కిటికీలకూ తనకోక ఉయ్యాలగా కట్టి, తన పిల్లవాణ్ణి అందులో పడుకోబెట్టి ఊపుతోంది. గుడ్డి బిచ్చగాడు రైలుపెట్టెలో దొంగతనంగా జొరబడి బతకమ్మ పాట పాడడం మొదలెట్టాడు. అరటిపళ్ళు, బటానీలు, తేలుమందు, పుస్తకాలు గులివితెడ్డులు, బొత్తాములు, రిబ్బన్లు, అమ్ముతున్నవాళ్ళు ఒక పెట్టెలోంచి మరొక పెట్టెలోకి, రైలునడుస్తూన్నప్పుడే, ప్రమాదాన్ని శంకించకుండా, రైలుపెట్టెల ఊచల సహాయంతో కదిలిపోతున్నారు. పరిశీలించే వానికి కావలిసినంత పరిశోధన వస్తువు ఆ రైలు పెట్టెలోని ప్రతి మనిషిలోను కనిపించుతుంది. ఏ జీవి వెనకాల ఎంత చరిత్ర ఉందో, ఆ చరిత్ర అర్థం చేసుకోవాలంటే ఏం చేయాలో, అనే ఆలోచన శివరాంకు కలిగింది. అయినా జీవితాలు అర్థం చేసుకోవాలంటే లిప్తమాత్రపు చూపులో జరిగే పనా?

రైలుపెట్టెమూల ఒంటరిగా కూర్చున్న ఒక జవ్వని ముఖప్రక్షాళనానంతరం అద్దంలో తిలకం దిద్దుకుంటోంది. బక్కపలచగా, పొట్టిగా, నాజూకుగా, లేతమందార పత్రం లాంటి ముఖంతో చురుకుగా, అందంగా కనిపిస్తున్న ఆ అమ్మాయి శివరాం హృదయంలో అణగారిన ఎన్నో గతస్మృతులు వెలికితెచ్చింది. సరిగ్గా ఆ అమ్మాయిలా ఉన్నా, లేకపోయినా, చాలావరకు ఆ పోలికలే శివరాం మనస్సులో దాగొన్న మగువలోకూడా ఉన్నాయి. అసలు జీవితంలో యింతధైర్యం, మొండితనం, సాహసంగా దూరప్రయాణాలుచేసి క్రొత్త జీవితం రూపొందించుకోవాలనే కోరిక ఆ అమ్మాయి వల్లనే కలిగింది. మనస్సు అపహరించి,

**తెలుగు భాషా సమితి బహుమతి పొందిన నవల**

# ★ అన్వేషణ ★

జీవితాన్నే మార్చేస్తారు. బాధగా ఒక నిట్టూర్పు విడిచాడు శివరాం. రైలు ప్రయాణంలో రాత్రి సరిగా నిద్రలేక ఎర్రగా ఉబ్బిన కన్నుల్లో వేడి బాష్పాలు తారట్లాడాయి. గుండె ఆవేదనతో వేగంగా కొట్టుకుంది. జీవితానికి సరిపడ్డ మనస్తాపం కలిగించిన శారదను ఎలా మర్చిపోగలడతను? ఉప్పొంగి వచ్చే శోకాన్ని, రైలు పెట్టెలోని జనం పరికించ గలరనే భయంతో లోలోపలనే అణుచుకొన్నాడు శివరాం, ముఖ భంగిమలు బలవంతంగా మార్చుకుంటూ. ఆరు సంవత్సరాల క్రితం మొట్ట మొదటగా శారదను చూశాడు శివరాం. గుమ్మంలో ఆగిన జట్కాలోంచి దిగింది ఆమె. బక్క పలుచని తెల్లని శరీరంలో, వంకీలు తిరిగిన శిరోజాలు ముడివడి దీర్ఘంగా వ్రేలాడే జడ చేత్తో ఆడిస్తూ, సన్నని దొండపండులాంటి పెదాలతో, జాలిగా నవ్వుతూ గుమ్మంలో అడుగు పెట్టింది. ఆమె అమ్మమ్మ, చిట్టెమ్మ కూడా చేత్తో మూట పుచ్చుకొని ఒంగిపోయిన వడుంలో తెల్లబడిన శిరోజాలలో తేలుతునే బ్రతుకులోని బాధల బరువుతో కుడతలుపడిన శోకమూర్తిలా ఉన్న విచార వదనంతో శారద వెనకాలేదిగి వీధి అరుగు మీద కూలబడింది. శివరాం తాతయ్య బ్రహ్మయ్యగారు పొలం వెళ్ళి శ్రమతో అలసిక తీర్చుకుందామని కుర్చీలో ఒరిగి, అన్నగారి భార్యను, శారదను చూచి చటుక్కున లేచి, సాదరంగా, సానుభూతితో లోపలికి ఆహ్వానించానించారు. అరుగుమీద కూర్చుని సావకాశంగా చదువుతున్న నవల మూసేశాడు శివరాం. ఇంట్లోకి రాగానే, శివరాం తల్లి, సుభద్రమ్మ, చెల్లెలు, లక్ష్మి, శారదను, ఆమె అమ్మమ్మను చుట్టుముట్టారు. సుభద్రమ్మ కంట తడిపెట్టుకొని చిట్టెమ్మను, శారదను ఓదార్చింది. పదేళ్ళ లక్ష్మి పరిస్థితి అర్థం కాక, విచిత్రంగా మూగగా చూసింది చిట్టెమ్మవైపు. బ్రహ్మయ్యగారు ఒక్క పట్టు పొడుంపీల్చి రాత్రి అతిథుల భోజనాలకు ఏర్పాట్లు చెయ్యమని సుభద్రమ్మకు చెప్పి, ఆలోచిస్తూ అరుగుమీదికిపోయి కూర్చున్నారు.

వయస్సు, ప్రపంచజ్ఞానము బాగా అలవడి పదిహేడేళ్ళు నిండి యువకుడౌతున్న శివరాంపరిస్థితి యిట్టే గ్రహించుకున్నాడు. శారద తలితండ్రులు తీర్థయాత్రలకు వెళ్ళి కృష్ణానదిలో పడవ ప్రమాదంలో మునిగి చనిపోయారు. ఈ ఘోర వార్తవిని తల బాదుకుంటూ చిట్టెమ్మ అనపర్తి వెళ్ళి, మిగిలిన ఒక్క మనుమరాలిని తనదగ్గరే ఇంక ఉంచుకొని పోషిద్దామని, తీసుకు వచ్చింది. బ్రహ్మయ్యగారి సలహా ప్రకారం రైలుదిగి, తిన్నగా ఆయన యింటికే శారదతోడ వచ్చింది చిట్టెమ్మ.

బ్రహ్మయ్యగారి ఆదేశంతో సుభద్రమ్మ వంటింట్లోకి ప్రవేశించింది. కాళ్ళు ముఖం కడుక్కొని చిట్టెమ్మకూడా పీటవేసుకొని వంటయింట్లోకి చేరింది.

ఏదో క్రొత్తస్నేహితురాలు దొరికినట్లు లక్ష్మి మూగగా, మెల్లిగా శారద దగ్గరకు వెళ్ళి చెయ్యిపట్టుకొంది. సన్నటి పెదవుల మధ్య దానిమ్మగింజల్లాకనిపించే తెల్లటి పళ్ళవరుస చూపిస్తూ, మెల్లిగా మందస్మితం చేసింది శారద స్నేహపూర్వకంగా.

పెద్దల బాధ్యత, బాధల వాతావరణం నుంచి యిద్దరు ఒక్కక్షణంలో తప్పుకున్నారు. దొడ్లో పాలేరు ప్రక్కలు పరిచి ఉంచాడు, క్రింద నీళ్ళుచల్లి. దొడ్లోని బొగడచెట్టు విచ్చినపువ్వులతో కిలకిల నవ్వింది పిల్లగాలికి. ఆబొగడ చెట్టుక్రింద తెల్లదుప్పటిమీదకు చేరారు లక్ష్మి, శారద.

దొడ్లో కుళాయిలోంచి ఏక ధార గా నీళ్ళు బిందెలో పడుతున్నాయి.

'నాపేరు లక్ష్మి!' లక్ష్మి నవ్వుతూ అంది.

'నాపేరు శారద!' లక్ష్మి బుజంమీద చెయ్యివేసి దగ్గరగా తీసుకుంది శారద. మాటలుదొర్లాయి కులాసాగా. మరుక్షణంలో వారిమనస్సులు కలిసిపోయాయి.

శివరాం దొడ్డివైపున ఉన్న వరండాలో నిలుచుని శారదవైపుచూశాడు. సంధ్యాగుణ రాగంలో కొద్ది ఎరుపుపూతల లాలిత్యంతో తొణికిలాడుతున్న శారద, చిన్నపువ్వుల తెల్లవాయిలు చీరతో అందాలరాశిలా దర్శనీయంగా అగుపడింది.

సుభద్రమ్మ దొడ్లో రుబ్బురోలులోవేసి రుబ్బుతున్న కందిపచ్చడి గుమ్మన కమ్మని వాసనలు వెదజల్లింది.

కొంటెగా జంటగా నడిచివచ్చారు శారద, లక్ష్మి, సుభద్రమ్మవద్దకు.

నోరూరుతున్న భంగిమలతో పెదవులు తడుపుకుంటూ నిలుచున్న ఆ పిల్లలను చూచి సరదాగా సుభద్రమ్మ కొంచెము పచ్చడి వాళ్ళచేతుల్లో రాల్చింది.

'అమ్మా! అన్నయ్యకుకూడా పెట్టవే!... వరండాలో యిందాకటినుంచి నిలుచున్నాడు—!' లక్ష్మి చిలిపిగా అన్నను హేళనచేసింది.

శివరాంతల్లి దగ్గరగావచ్చినిలుచున్నాడు.

'మీ అన్నయ్యా?' శారద మెరుస్తున్న కళ్ళతో శివరాంవైపు తిరిగి మందస్మితం చేసింది. శివరాంకూడా నవ్వాడు.

‘చదువు కుంటున్నావా?’ అడిగాడు శివరాం ‘పోస్టుఫారం పరీక్షకు వెళ్ళాను!
మాష్టరుగారి ప్రశ్నకు సమాధానమిచ్చి నట్లు చెప్పింది శారద!
‘నేను స్కూలు ఫైనలు పరీక్షకు వెళ్ళాను ఠీవిగా బుజాలెగరేశాడు శివరాం.
‘మా అన్నయ్య అస్తమానం నాతో తగువులాడుతాడు నువ్వు నాజట్టా? ... అన్నయ్యజట్టా! లక్ష్మి శారదను చెయ్యి పుచ్చుకుని ప్రక్కకిలాగింది.
‘ఇద్దరిజట్టూను!” నవ్వింది శారద.
‘ఇంక నీతో దెబ్బలాడను చెల్లాయీ!’ శివరాం అభిమానంతో ప్రతిన పట్టినట్లు స్ఫుటంగా అన్నాడు.
ఏం!...ఇకముందు శారదతో దెబ్బలాడుతావా? చిలిపిగా గట్టిగా నవ్వింది లక్ష్మి.
శారద, కిల కిల నవ్వింది. కజ్జాకు కాలు దువ్వి, చిలిపిగా సవాలుచేసినట్టు చూసింది శారద. శారదతో కజ్జా పెట్టుకుంటే సరదాగా ఉండేలా ఉంది అనుకున్నాడు శివరాం.
నీకు మంచికథలు వచ్చా? శారద ఏదో ఆలోచిస్తు అడిగింది.
‘చెప్పనా?’ శివరాం ఆత్రుతగా మంచం మీద ప్రక్కగా కూర్చున్నాడు.
చంద్ర వంకవెన్నెల్లో పొగడచెట్టు కొమ్మల నీడల్లో, పిల్లగాలుల అలల్లో, ఆనందంగా కథలు చెప్పుకుంటూ కులాసాగా గడుపుతున్న ఆ ముగ్గురిని చూసి స్నానము చేద్దామని దొడ్లోకివచ్చిన బ్రహ్మయ్యగారు జాలిగా, బాధగా, బాధలోంచి ఉద్భవించే ఆప్యాయతతో,ఒక కన్నీటి చుక్క వదిలారు. తాను బ్రతికుండగా చెట్టంత కొడుకు చనిపోవడం, అన్నగారి మరణానంతరము ఒంటరిగా బ్రతుకుతున్న ఒదినెగారు జీవితంలోని ఒక్కకూతుర్ని పోగొట్టుకోడం కళ్ళముందు తిరిగి బ్రహ్మయ్యగారు నిట్టూర్చారు. పెద్దతనంలో బాధ్యతలతో బ్రతకవలసి వచ్చిందనే బాధకంటే, తలిదండ్రుల ప్రేమతో నిండుగా జీవితాలు గడపలేని అనాధలుగా ఆపిల్లలు తయ్యారని బ్రహ్మయ్యగారు లోలోపల కుమిలి పోయారు.
తువ్వాలు చుట్టుకొని కుళాయి క్రింద కూలబడ్డారు బ్రహ్మయ్యగారు.
‘తాతయ్యా! వడ్డిరుద్దనా?’ శివరాం దగ్గరికి చేరాడు.
‘తాతయ్యా! నీవంటికి సబ్బుపట్టించనా?’ లక్ష్మి గెంతుతూ ముంగుకు వచ్చింది.
‘తాతయ్య తువ్వాలు నే ఉతుకుతా!’ శారద నవ్వుతూ మెల్లిగా బ్రహ్మయ్యగారి దగ్గరకువచ్చి నిలబడింది.
కుళాయిధారలో స్నానంచేస్తున్న బ్రహ్మయ్యగారు తల నీళ్ళతో నిమురు కుంటూ, పిల్లల్ని చూసి సరదాగా నవ్వాడు.
ఎరమరిక లేక పిల్లలతో కలిసిపోయిన

# ★ అన్వేషణ ★

శారదను చూసి చిట్టెమ్మ లోపల ఆనందంతో కొంత మనశ్శాంతి పొందింది.

హరికేను లైటు వెలుగులో, అమాయకమైన కబుర్లతో, ఏదో అల్లరి చేస్తూ, మామిడిపండ్లరసం జుర్రుతూ, భోజనాలు చేశారు పిల్లలు బ్రహ్మయ్యగారితో.

పుల్లదనంలోంచి తియ్యదనం పొందిన మామిడిపండులా, బాధల్లోంచి ఆనందం పొందారు వయస్సుతో కుంగిన బ్రహ్మయ్యగారు

దొడ్లో తెల్లదుప్పట్లతో వెన్నెల్లో మెరుస్తున్న ప్రక్కలమీద ఒరిగారు అంతా. శివరాం బ్రహ్మయ్యగారి మంచముమీద చేరాడు. లక్ష్మి, సుభద్రమ్మ ఒడిలో దూరింది. చిట్టెమ్మ శారద కురులునిమురుతూ హత్తుకుని మంచముమీద పడుకుంది.

బ్రహ్మయ్యగారు అలసి ఉండటంచేత గుర్రుపెట్టి నిద్రలో మునిగారు. తక్కిన మంచాలమీది జనం కూడా సుషుప్తిలో సొమ్మసిల్లి పోయారు.

శివరాం ఆకాశంవైపు చూశాడు. నిర్మలమైన ఆకాశంలో తెల్లదూదిలాంటి మబ్బులు తేలుతున్నాయి మబ్బుల మాటుల్లోంచి తారలు మిణుకు మంటున్నాయి. కాంతివంతమైన వెలుగుతో చంద్రుడు కలకలలాడుతున్నాడు. అలా చూస్తూఉంటే జీవితం అంతా హాయి అనిపించింది.

శారదను చూడగానే ఏదో అభిమానం ఏర్పడి శివరాం హృదయంలో ఏదో సన్నిహితత్వం ఏర్పడింది. పలచగా, గుండ్రంగా చంద్రబింబంలా మెరుస్తున్న శారద ముఖముమీద బొగడపూలురాలి కురులలో దూరి సొగసుగా నిలుచున్నాయి.

'శారద చాల మంచిపిల్ల!' అనుకొని లోలోపల నవ్వుకొని బ్రహ్మయ్యగారి వక్షంలోకి ముఖందూర్చి కళ్ళు మూసుకున్నాడు శివరాం.

వారం రోజులు గడిచాయి. శివరాం, శారద పేకాట, గవ్వలు, కేరమ్సు ఆడుకుంటూ, లక్ష్మితో దాగుడుమూతలు పరుగుపందాలు జరుపుతూ కాలంగడిపారు. వారం గడిచాక చిట్టెమ్మ శారదను తీసుకొని ప్రక్కవీధిలోని స్వంతయింటికి వెళ్ళిపోయింది.

ప్రతిరోజు వీలుచేసుకొని శివరాం, లక్ష్మి, శారదను చూడటానికి చిట్టెమ్మ యింటికి వెళ్ళి వచ్చేవారు. తర్వాత స్కూళ్ళు తెరిచారు. శారద ఐదవఫారంలో చేరింది. శివరాం ఇంటర్ లో ప్రవేశించాడు. లక్ష్మి రెండవఫారంలోకి వచ్చింది. చదువుల గడబిడలో రెండు సంవత్సరాలు గడిచిపోయాయి.

ఆ రెండు సంవత్సరాలలో శారద రూపం మారింది. ఒళ్లుచేసింది. బుగ్గలు నున్ననై, నవ్వులో, సిగ్గులో సొట్టలు పడుతున్నాయి. మెరిసే కళ్ళలో చిలిపితనం తొంగిచూస్తున్నది. హాయిగా కిలకిలా మునుపు నవ్వే శారద అదోలా మృదువుగా, బిగువుగా, లజ్జగా మందస్మితం చేయసాగింది.

ఒకరోజు శివరాం చిట్టెమ్మయింటికి వెళ్ళాడు వసారాలో బల్ల ఉయ్యాలమీద కూర్చుని జేబురుమాలుపై అల్లిక ఏదో కుడుతోంది శారద. తలంటుతో స్వేచ్ఛగా విడివడిన వంకెలజుట్టు శారదకు క్రొత్త అందంయిచ్చింది. గులాబీరంగు చీరకట్టుకుని రేకులు విచ్చుకున్న గులాబీలా ఉయ్యాలలో ఊగింది శారద.

'ఏమిటి కుడుతున్నావు?' శివరాం, శారద చెయ్యి పట్టుకున్నాడు.

'నిన్నే కుడుతున్నా!'

శివరాం జేబురుమాలు చూశాడు. తన పేరు ఎర్రగులాబీ రేకుల్లా ఆ రుమాలుమీద అల్లుకుంది.

'నన్ను నిజంగానే కుట్టేవు!' నవ్వాడు శివరాం. జేబురుమాలు లాక్కుంది శారద.

'రుమాలుమీద కాదు!' అంటూ శారద పకపక నవ్వింది.

పేరు కుట్టిన రుమాలు మెల్లిగా శివరాం జేబులో కుక్కింది శారద.

శివరాం శారద బుగ్గ నిమిరాడు. శారద సిగ్గుపడి లోపలికి పరుగెత్తి వెళ్ళిపోయింది. 'అమ్మమ్మా! శివరాంబావ వచ్చాడే!' గట్టిగా అరిచింది శారద.

లక్ష్మిని తోడుతీసుకుని, శివరాం, శారద కలిసి, సినిమాలకు వెళ్ళడం, పార్కులో సాయంకాలం గడపడం పరిపాటైపోయింది.

శారద కాలేజిలో చేరింది. చేరిన నాల్గు నెలల్లో ఎంతో మార్పు! కట్టులో, నడకలో, మాటలో భావంలో, పూర్తిగా మార్పు కనిపించింది శివరాంకు. ఆమె యింట్లో ఆడ స్నేహితులు పెరిగిపోయారు. తరుచు ఎవరో విద్యార్థులుకూడా వస్తూ ఏదో సంభాషణలతో చాలకాలం గడిపేవారు. శివరాంవచ్చినప్పుడు కాస్సేపు మాట్లాడి స్నేహితులతో పనివుందని వెళ్ళిపోయేది శారద. కాలేజి ఎన్నికలలో వక్తృత్వపు పోటీలలో, నాటకాలలో పాల్గొని బహుమతులు సంపాదించేది. ఆ బహుమతులు చూసి మురిసిపోయేది చిట్టెమ్మ.

శారద ఇంటర్ రెండవసంవత్సరములోకి వచ్చింది. శివరాం బి. ఎ. ఆఖరి సంవత్సరం చదువుతున్నాడు. శారద సరదాగా శివరాంతో మాట్లాడుతున్నా, మునుపుకనబరచినంత ఆత్రుత ఆదరణ చూపించటం లేదని శివరాం అనుమానపడిబాధపడేవాడు. కాలేజి కార్యక్రమాలలోను, చదువులతోను స్నేహితుల సాంగత్యముతోను తీరుబడిలేకపోవడం నిజమైనా, శారదలో ఏదోమార్పు వున్నట్లు మాత్రం స్ఫురించింది శివరాంకు.

శివరాం ఒకరోజు సినిమాకు వెళ్లాడు. సోఫాలలో వెనకగా శారద, మాధవరావు కనిపించారు. శారద శివరాంను చూసి నవ్వింది. మాధవరావు శివరాం తోటివిద్యార్థి. ఆఏడు కాలేజి విద్యార్థిసంఘానికి అధ్యక్షుడు. బాగా డబ్బున్నవాడు. అందమైనవాడు. శివరాంకన్న పదిరెట్లు హోదా కనపరిచే మనిషి. మాటల చాకచక్యంతో మనుష్యుల స్నేహము సంపాదించే నేర్పుగల మాధవరావుకు శారద స్నేహం అంత కష్టం లేకుండానే లభించింది. కాలేజి కార్యక్రమాలలో కొంత ఘనత వహించిన

(42-వ పేజీ చూడండి)

# నక్షత్ర ఫలితాలు

**[ 20-5-59 మొదలు 26 5-59 వరకు ]**

గ్రహస్థితి.

| శ | బు | ర | శు |
|---|---|---|---|
|  | 23వ తేది బుధుడు వృషభములో ప్రవేశించును. |  | కు |
|  | తుల, వృశ్చిక, ధనుర్మకరములలో చంద్రుడు. |  |  |
| కే | గు |  | రా |

## *అశ్విని [చూ, చే, చో, లా]*

ఈ వారము ధనధాన్యాభివృద్ధి, పశువృద్ధి కృషిమూలకముగా లాభము, వివాహాది శుభ కార్యాలలో పాల్గొనుట, ఇష్టవస్తులాభము, పరోపకారమువల్ల కీర్తివంటి రాజయోగములు కలుగును. విద్యార్థులు వినోదములలో పాల్గొన్నా చదువుబాగా సాగుతుంది. విలువగల వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు రెట్టింపులాభము. కవులకు గాయకులకు కళాకారులకు నటీనటులకు యోగకాలము. స్త్రీలతోనూ, ఆప్తులతోనూ విందు వినోదము. 24, 25 కుటుంబకలహము.

## * భరణి [లీ, లూ, లే, లో] *

ఈ వారము మీకు రాబడి తక్కువ, కార్యభారము ఎక్కువ. గృహావసరములు తీరక కలతలు. ఆరోగ్యము చెడుచున్న సూచనలు కనబడగానే ఔషధ చికిత్స పొందవలెను. మేకాకుండా గ్రహరాజయిన రవికి శాంతిచేయించుట మేలు. ఉద్యోగస్తులకు కొత్తసమస్యలు. వర్తకులకు ఆందోళన. విద్యార్థులకు చదువుసరిగా సాగదు. 20, 22 23 పితృవర్గసహాయము, కార్యలాభము, ప్రయాణము. 21 రాజకీయవాదులకు ఆందోళన, అధిక ఖర్చులు. 24, 25 అనారోగ్యం.

## * కృత్తిక [అ, ఈ, ఉ, ఏ] *

ఈ వారము మీకు మొదట్లో నిరాశగా వున్నా మిత్రసహాయమువల్ల కార్యలాభము పొందుతారు. ధనలోపమువల్ల ఆందోళన. ఉద్యోగస్తులకు బద్ధకమువల్ల చెడువుసాగదు. ఆప్తుల ఆరోగ్యము ఆందోళన కలిగిస్తుంది. వారములో అవయోగములున్నా మిత్ర సహాయము, కార్యసిద్ధి, విదేశీయుల పరిచయము, విచిత్రవస్తుసంపాదనవంటి శుభ యోగములు కూడా వుంటాయి.

## * రోహిణి [ఓ, వా, వీ, వూ] *

ఈ వారము మీకు మిశ్రమయోగము. కార్యాచరణలో ఆటంకములు కలుగుతాయి. మీ బుద్ధిబలము నుపయోగించి ప్రయత్నించినా కార్యసిద్ధివుండదు. చేతికివచ్చే డబ్బు అవసరములకు సరిపోక ఇబ్బందిగనే అశాంతిగా వుంటుంది. దూరమందున్న ఆత్మీయులకు అనారోగ్యముగా ఉందని తెలిసి వ్యసనపడతారు. అయిననూ దైవానుగ్రహముచే అన్నీ సరిపడ్డాయనే మనోధైర్యముతో వుంటారు. ఉద్యోగస్తులకు అనిమిత్తము, వర్తకులకు ఆందోళన, నిలకడలేనిస్థితి, ప్రయాణము. 23-న నష్టద్రవ్యప్రాప్తి, పుణ్యక్షేత్ర సంచారము, దేవతాదర్శనము, వింతలను చూచుట. 25

**బి. నరసింగరావు**

ఆరోగ్య-చింత.

## * మృగశిర [వే, వో, కా, కీ] *

ఈ వారము అనుకున్నట్టుగా డబ్బు చేతికి రాకపోవుటచేతను, అధిక ఖర్చులచేతను అశాంతి కలుగుతుంది. కోర్టు వ్యవహారాలు కొంతవరకు అనుకూలిస్తవి. ఉద్యోగస్తులకు అధికారుల తొందరలు, వర్తకులకు అశాంతి భార్యకు ఆరోగ్యము బాగుండదు. వ్యవహారముల పరిష్కారములో దుష్టస్త్రీలతో వివాదము. విద్యార్థులకు చదువుపై అనాసక్తి 20 ధనలాభము. 21, 22 కార్యభారము, త్రిప్పట, కార్యసిద్ధి. 24 వివాదములు, భార్య అనారోగ్యము.

## * ఆర్ద్ర [కూ, ఖ, జ, ఛ] *

తలపెట్టిన పనులు మీదవేసుకొని కార్యసాధన అవనప్పటికి నిరుత్సాహపడక పట్టుదలతో ప్రయత్నించి తుదకు ఫలమును పొందుతారు. సోదరసహాయము కొంత అనుకూలత కలిగిస్తుంది. ఉద్యోగస్తులకు అధికారుల చురుకుమాటలచే మనోవ్యసన కలుగుతుంది. అవసరాలు తీరనందున ఇంట్లో అశాంతి, ప్రమాదములవల్ల గాయములు కలుగవచ్చును. రసాయనిక పదార్థములు ఎరువుల వ్యాపారస్తులకు, గనులయజమానులకులాభము. 21, 22 కార్యభారము, ఆటంకములు. 23 సోదరసహాయము, కార్యలాభము. 25 ప్రమాద సూచన.

## * పునర్వసు [కే, కో, హా, హీ] *

ఈ వారము మీకు యోగదాయకము. బంధుసహాయము, అధికారుల సహాయము కలుగుటచేతను, ఆటంకములను గడిచి కార్యలాభము పొందుతారు. ఆదాయము వృద్ధి అగును. కవులు నూతన రచనలు చేస్తారు. బంధువుల క్షేమవార్త తెలిసి సంతోషిస్తారు. విద్యార్థులకు వుత్సాహముగా వుంటుంది. గణిత శాస్త్రజ్ఞులకు, కవులకు, శిల్పులకు, చిత్రకారులకు, నటీనటులకు మేలుకాలము,

## * పుష్యమి [హూ, హే, హో, డా] *

ఈ వారము మీకు మంచి భాగ్యయోగము. అనుకున్న డబ్బు చేతికి వస్తుంది. ఇబ్బందులు తీరుతాయి. దావాలలో గెలుపు పొందుతారు. పిల్లల బాగుకొరకు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. విజ్ఞానాభివృద్ధి కలుగుతుంది. విద్యార్థులకు చదువు బాగా సాగుతుంది. న్యాయస్థాన వుద్యోగస్తులకు న్యాయవాదులకు, పండితులకు, ఉపాధ్యాయులకు మేలుకాలము.

## * ఆశ్రేష [డీ, డూ, డే, డో] *

ఈ వారము మీకు యోగదాయకము. ధనయోగం వుంటుంది. సంగీతసభలు, ఇవిత గోష్ఠివంటి వినోదాలలో పాల్గొని మృష్టాన్న భోజనము వెండి పాత్రలలో చేస్తారు. శుభ కార్యాలలో పాల్గొంటారు. నూలు, బట్టలు, బియ్యము, వెండి వర్తకులకు లాభము. విద్యార్థులు ఉత్సాహముగా చదువుకుంటారు. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలుగా వుంటుంది.

## * మఖ [మా, మీ, మూ, మే.]

ఈ వారము యోగదాయకముగా వుంటుంది. అసంపూర్తిగా వుండిపోయిన పనులు లాభకరముగా ముగుస్తవి. శుభ పుణ్య కార్యాలలో పాల్గొంటారు. నూతన గృహ నిర్మాణమునకు ప్రయత్నిస్తారు. ఉద్యోగస్తుల హోదా పెరుగుతుంది. వర్తకులకు విలువగల వస్తువుల క్రయవిక్రయములలో ఎక్కువ లాభము. వారమంతా శుభయోగములతో కూడివున్నా కుటుంబకలహముచే ఆందోళన కలుగుతుంది. వారమంతా కుటుంబములో మిత్రులతో విందు వినోదము.

## * పూర్వఫల్గుణి (పుబ్బ) *
## (మో, టా, టీ, టూ)

ఈ వారము రాబడి తక్కువ. కార్య

* మూల [యే, యో, బా, బీ] *

ఈవారము మీకు యోగప్రదము. ధన ధాన్యవృద్ధి కలుగుతుంది. వివాహాది శుభ కార్యాలలో పాల్గొంటారు. ఇష్ట వస్తు లాభము. పరోపకారంవల్ల కీర్తికలుగుతుంది. విద్యార్థులకు చాలాచురుకుగా చదువు సాగుతుంది. ఖరీదైన వస్తువుల క్రయ విక్రయము లలో వర్తకులు అమితలాభము పొందుతారు. వాహనయోగములు కలుగును. కవులకు, గాయకులకు, కళాకారులకు నటీనటులకు యోగకాలము. 25 న కుటుంబకలహము.

* పూర్వాషాఢ [బూ, ధ, భా, డా] *

ఈవారము కార్యభారము ఎక్కువ. వింతమాటలు వినుట, పరాక్రమమువల్ల ఘనత, ప్రయాణము, ధనలాభము వుండును. అకాలభోజనమువల్ల అనారోగ్య సూచనలు కనపడగానే జాగ్రత్తపడుట మంచిది. ఉద్యోగస్తులకు స్వల్పఅనుకూలత. విద్యార్థులకు చదువు సరిగాసాగదు. రాజకీయవాదులకు వారమంతా అలజడితోపాటు అనుకూలత. 24 న అనారోగ్యం.

* ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ] *

ఈ వారము తలపెట్టిన పనులు నెరవేరవు. ఆలస్యము కలుగుతుంది. వర్తకులకు లాభము ఎక్కువ. ఆత్మీయుల ఆరోగ్యం చికాకు కలిగిస్తుంది. ఉద్యోగస్తులకు వన పర్వత ప్రాంతములకు. బదిలీ అయే సూచన లున్నవి. రహస్యములను. కనిపెట్టుటకు నియోగించబడుతారు. వారమంతా చికాకుగా వున్నా వారాంతములో మిత్రసహాయము. విదేశీయుల పరిచయము. కార్యసిద్ధి జరుగును.

* [శ్రవణము జూ, జే, జో, ఖా] *

ఈ వారము ధనాభావము ఎక్కువ. ఎవరి సహాయంవల్ల కార్యసాధన చేదామనుకుంటారో వారివల్లనే ఆటంకములు కలుగుతవి. అయిననూ దైవబలంవల్ల క్రమేణా కార్యానుకూలత అవుతుంది. ఇంట్లోవారి ఆరోగ్యము బాగుండదు. ఉద్యోగస్తులకు ఒత్తిడి. వర్తకులకు నిరాశ. విద్యార్థులకు మంచిరోజులు కావు. వారమంతా ఆందోళన వున్నా సాధుసజ్జన సాంగత్యము. పుణ్యక్షేత్ర సంచారము. దేవతాదర్శనము వింతలను చూచుట, నష్టద్రవ్యలాభము కలుగుతవి.

* ధనిష్ఠ [గా, గీ, గూ, గే] *

ఈ వారము అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. యత్నకార్యములు శ్రమాధిక్యముతో ఫలిసవి. కోర్టుదావాలు అనుకూలిస్తవి. పరోపకారానికి యత్నపడి సాగక నిందలు పొందుతారు. భార్య ఆరోగ్యము సరిగా యుండదు. ఇచ్చిపుచ్చుకొనేపట్ల వివాదములు ఉద్యోగస్తులకు అధికారుల ఒత్తిడివున్నా తోటివారి సహకారము లభిస్తుంది. వర్తకులకు వారమంతా నిరాశ. వారాంతమున లాభము. విద్యార్థులకు చదువుబాగా సాగదు.

* శతభిషం [గో, సా, సి, సూ] *

ఈ వారము ఎన్ని అవాంతరములు వచ్చినా పట్టుదలతో ప్రయత్నించి కార్యలాభము పొందుతారు. ఆశించిన ధనం సమయానికి కందక అప్పు చేస్తారు. ఆత్మీయులవల్ల నిందలపాలవుతారు. దెబ్బలుతగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. గనుల యజమానులకు, భూస్వాములకు, ఇంజనీరింగు శాఖ ఉద్యోగులకు, రంగులు లోహపు సామానుల వ్యాపారస్తులకు, కష్టముతో కూడిన లాభము. 24 న ప్రమాదభయం.

* పూర్వాభాద్ర [సే, సో, దా, దీ] *

ఈ వారము మీకు యోగప్రదము. బంధువుల సహాయముతోను అధికారుల సహాయముతోను ఆటంకములు గడిచి ఫలం పొందుతారు. ఆదాయము వృద్ధిఅవుతుంది. వైద్య జ్యోతిషశాస్త్రప్రసంగాలు చేస్తారు. ఈశాన్య దిక్కునుండి క్షేమము తెలుస్తుంది. విద్యార్థులకు మంచికాలము. కవులకు, శిల్పులకు, గణితశాస్త్రజ్ఞులకు, నటీనటులకు యోగకాలము 20, 23 తేదీలలో ధన లాభము, కార్యసిద్ధి.

* ఉత్తరాభాద్ర [దూ, శం, ఝా, థా] *

ఈ వారము మీకు యోగదాయకముగా వుంటుంది. ఆశించిన సొమ్ము చేతికి వస్తుంది. నూతన కార్యములు ప్రారంభిస్తారు. కోర్టు దావాలలో కొంత అనుకూలత వుంటుంది. పండితగోష్ఠి జరిపి విషయాలు తెలుసుకుంటారు. వారమంతా శుభయోగము లున్నా కొంత ఆందోళనతో కూడివుంటుంది. ధనలాభము. పుత్రుల అభివృద్ధి, కార్యసిద్ధి. 21 న అధికఖర్చులు. విద్యార్థులకు చదువు బాగా సాగుతుంది. న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు, పండితులకు ఉపాధ్యాయులకు మేలుకాలము.

* రేవతి [దే, దో, చా, చీ] *

ఈ వారము వినోదములలో పాల్గొనుట దధి, క్షీరమధురపదార్థ యుక్తభోజనము రజతపాత్రలలో భుజించుట, తలచిన కార్యములలో జయము, నీటిమీద ప్రయాణము, తెల్లని వస్త్రములు కొనుట మొదలగు యోగములు కలుగును. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, వెండి, బియ్యము ద్రవపదార్థముల క్రయ విక్రయములలో వర్తకులకు లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలుకాలము. వారాంతమున అధిక ఆందోళన.





# వనితా లోకం



## మనలో 'మనం':
## 'తివిరి ఇసుమున...'

'త్రివిరి యిసుమున తైలంబు దీయవచ్చు,
తవిలి మృగతృష్ణలో నీరు త్రాగవచ్చు,
తిరిగి కుందేటి కొమ్ము సాధించవచ్చు,
చేరి మూర్ఖుల మనసు రంజింపరాదు.'

అన్నాడు యశోనిధి భర్తృహరి. భర్తృహరినీతి సుధానిధిలో నిదియొక బిందువు. ఇది మూర్ఖుల వైపునకు చిమ్ముతుంది. ఈ పై పద్యములో మొదట చెప్పిన మూడుపనులూ అసాధ్యాలే. అయినా ప్రయత్నిస్తే సాధ్యము కావచ్చుట. కాని మూర్ఖులను తృప్తిపరచుట మాత్రము మనతరము కాదట.

నిజమే. ఇది మననిత్యజీవితములో రోజూ అనుభవములోకి వస్తూ ఉంటుంది. అసలు భర్తృహరి సుభాషితాలలో ఏదో ఒకటి వినమా జ్ఞాపకం రాకమానదు. భర్తృహరి సుభాషితాలన్న మాటేమిటి ఒక సుమతీ శతకం పద్యాలు చూడండి. వేమన పద్యాలలో సత్యం ఎవరైనా ఒప్పుకోక తప్పుతుందా? 'భాస్కరశతకం' 'నా మాటేమి చేసెరు?' అంటుంది–ఇలాగ స్వచ్ఛమైన సత్యాలు చాటుతాయి కనుకనే ఆ పద్యాలూ, అలా నిలచాయి. కర్తలూ ఆంధ్రసాహిత్యంలో చిరంజీవులయ్యారు.

* * *

మూర్ఖులంటే అదేదో వేరజాతి అనుకోనక్కరలేదు. ప్రతివ్యక్తియు జీవితంలో ఒక్కసారైనా మూర్ఖంగా ప్రవర్తించడం సహజం. పిమ్మట తన ప్రవర్తనకు తానే పశ్చాత్తాపపడి సిగ్గుకూడా పడవచ్చు. కనుక వైత్యం వగైరాలు అందరిలోనూ ఉన్నట్టే మూర్ఖత ఒక్క శాతమైనా ప్రతి వ్యక్తిలోనూ ఉంటుంది. ఎటొచ్చీ దాని 'పాలు' ఎక్కువైనప్పుడే చిక్కు వస్తుంది. ఆయా వ్యక్తులతో మనం కొంచెం జాగ్రత్తగా

**బి. వి. కామేశ్వరి**
**బెంగుళూరు**

ఉండాలి. విశేషించి వాళ్ళకి ఆ 'మూడ్' వచ్చినప్పుడు.

వెనుక నొకప్పుడు అక్బరు చక్రవర్తి 'మూర్ఖులవద్ద నెలా ప్రవర్తించాలి' అని వీరబలుని అడిగేడట. అందుకు వీరబలుడు మరునాడొక మూగవానిని చక్రవర్తిగారి సముఖంబున నిలబెట్టి 'ఆ ప్రశ్న వానిని వడగండి సమాధాన మీయగలడని' చెప్పాడట. చక్రవర్తి అతడు మూగవాడని తెలియకుండా– అడిగి అడిగి అతడు సమాధానమీయక పోవడంతో కోపగించి, 'సమాధానం చెప్పడేమని వీరబలు నడిగాడట. అందు కాతడు "మహారాజా! 'మూర్ఖులవద్ద మౌనముగనుండవలెను' అని చెప్పుతూనే యున్నాడు" అన్నాడట. అక్కడికి అక్బరే మూర్ఖుడని అర్థం వచ్చింది. అయినా అక్బరు అతి మూర్ఖుడు కాదు కనుక అమాంతం వీరబలుని మీద విరుచుకుపడక ముసిముసి నవ్వులతో ఊరుకున్నాడు. మెచ్చుకున్నాడు కూడాను.

లేకపోతే తన ప్రశ్న ఏమి బాగుంది- మూర్ఖులతో సమయోచితంగా ప్రవర్తించాలి.

ఒకరోజు రాత్రివేళ, నడివీధిలో ఇద్దరు త్రాగినవాళ్ళు కుస్తీ పట్టుతున్నారట. రెండో ఆట సినిమానించి వస్తున్న ఒక పెద్ద మనిషిని పట్టుకు నిలవేశారు. "బాబూ! మీరే చెప్పండి! ఆకాశంలో వాడు సూరీడా! కాదు? మావాడు చంద్రుడంటాడు" అన్నారుట ఒకడు. ఆ వేళ పున్నమి. ఆ పెద్దమనిషి కొంత ఆలోచించి— "ఏమో నాయనా! నేను పొరుగూరివాణ్ణి– ఈవూరి సంగతులు నాకు తెలియవు" అని చెప్పాడట."

"పాపం! ఈయనకేం తెలుసు? ఈవూరు కాదులే." అనుకొని వెళ్ళిపోయేరు.

మా పొరుగింటామెకు, నాకు రెండు రోజుల కొకసారైనా వస్తూ ఉంటుంది ఇలాంటివాదం. ఆమెకు ఆచారాలంటే చాల నమ్మకం. పరికిణీమీద ఆరు గజాలచీర కట్టుకుంటాను నేను. రోజూ 'అది ఆచారం కాదు తగదు; దేవుని పూజకు 7 గజాల చీరలో కచ్చపోసి కట్టుకుంటేకాని పనికిరాదు" అని. ఒకవేళ నిజమే అయినా అలవాటు తప్పించుకోడం కష్టంగదా, శుభ్రంగా ఉంటే అది మాత్రం ఆచారంకదూ! మొదట నాతో ఇలా వాదించిన తనే ఇప్పుడు నాలాగ 6 గజాల చీరలు కట్టుతోంది. అప్పుడు నేను వాదించకుండా 'లోకో భిన్నరుచిః' అని ఊరుకున్నాను కనుక సరిపోయింది. ఒక్కొక్కప్పుడు నా మనసు చాల బాధపడుతూ ఉంటుంది. ఆమె మాటలకు. కాని ఆమె కల్లాకపటం ఎరగదు. నేనూ అతిగా వాదించక ఊరుకుంటూ ఉంటాను. ఇలా మా స్నేహం సవ్యంగా సాగిపోతోంది. ఇదంతా ఎందుకు వ్రాసేనంటే సాధారణంగా స్త్రీలలో చాల వాదోపవాదాలు వస్తూ ఉంటాయి. విద్య తక్కువ కావటంచేత లోకజ్ఞానం తక్కువ కావటంవల్ల అని అను

(41-వ పేజీ చూడండి)

# 'మహారాజశ్రీ మామగారికి' -

## 1

శ్రీ "సుందరి" సంపాదకులకు,
మహాశయా,

నమస్తే. ఈ ఉత్తరము నా స్నేహితురాలు నాకు రాసింది. దీన్ని పత్రికలో ప్రచురిస్తే కొంతైనా ఉపయోగం ఉండక పోదని ఉన్నదున్నట్లుగా కాపీతీసి పంపుతున్నాను. మీకు నచ్చకపోతే అవసరమైన స్టాంపు పంపుతూనే ఉన్నాను. తిప్పి పంపండి. సెలవు.

రా. సత్యవతి.

* * *

సత్యం,

నువ్వు నాకు ఉత్తరంరాసి చాలాకాలమైంది. బహుశా కాలేజీలో కొత్తగా చేరే సంబరంలోనూ, హడావుడిలోనూ నీకు తీరిక దొరక లేదేమో. బోటనీ గ్రూపే తీసుకున్నావనుకుంటాను. దిక్కుమాలిన లెక్కలతో సంబంధం ఈజన్మకి వదిలిపోయినందుకు నీకు నా హృదయపూర్వకాభినందనాలు.

ఏ దగ్గర్నుంచి ఉత్తరం రాకుండానే నేను ఇనీషియేటివ్ తీసుకొని రాయడం నా స్వభావానికి విరుద్ధంగదా అని నువ్వు ఆశ్చర్యపడతావేమో, మరేంలేదు. నువ్వు గుంటూరు కాలేజీలో చేరావని, మీ చెల్లెలు చెప్పినప్పటినుంచి నా ఆవేదనంతా నీకు రాస్తే నాకు కొంత ఉపశమనం కలుగుతుందేమోనని రాస్తున్నా.

టూకీగా చెప్పమంటే, నన్ను కాలేజి చదువుకు పంపవద్దనీ పంపడం తన కేమాత్రమూ ఇష్టంలేదనీ, నాన్నగారికి ఆయన ఉత్తరం రాశారుట. ఆడవాళ్ళ కాలేజీకి కూడా పంపకూడదట.

"ఈ సంగతి తెలిస్తే నేను పెళ్ళికి ఒప్పుకునేదాన్ని కాదు నాన్నగారూ." అన్నాను.

"నాకు తెలిసే ఒప్పుకున్నా నమ్మాయి." అన్నారాయన, కారణం: ఆయన బుద్ధిమంతుట. బుద్ధిమంతుడంటే ఏమిటో మీ తెలుగు లెక్చరర్ని అడిగి నాకు రాయి.

కాలేజీ అమ్మాయిలందరి కారెక్టరుమీదా ఆయనకు నమ్మకం లేకపోవచ్చు. అంత ఫూలుగా కనిపించలేదాయన. నన్ను గురించి ప్రత్యేకంగా అపనమ్మక మనుకోడానికి కనీసం వీల్లేదు, నేనంటే ఆయనకెంత ప్రేమో ఎంత గౌరవమో నీకిదివరకే చెప్పాను. పోతే దీనికి కారణం: కాలేజీ ఆడపిల్లలు బజార్లో తిరుగుతూంటే ఇప్పటి యువకులు ప్రవర్తించే విధానం తలుచుకుని నన్నా పరిస్థితుల్లో ఊహించుకుని ఒళ్ళు జలదరించి ఉంటుందాయనకు. ఆయనమాత్రం. అటువంటి పనులు తానుగా ఎప్పుడూ చేసిఉండరనే నా విశ్వాసం.

ఒక్కసారి నేనే ఆయనైతే, ఆయన భావాల్ని ఊహించుకుంటే నాకే చాలా ఇదిగా ఉంది. ఈ విషయంలో ఆయన్ని కేవలం నిందించలేక పోతున్నా. ఆయన హృదయం ఇంకొంచెం విశాలమైతే దీన్ని లెక్కపెట్టక పోయేవారేమో అనిపిస్తోంది.

పోనీ, ఆయన ఇట్లా రాసినా, గప్‌చుప్‌గా చేరి చదువుకుంటానని గట్టిగా పట్టుపడితే

---

### చి॥ ఎ. వారు శ్యామలాంబ
### (హైదరాబాద్)

---

నాన్నగారు అడ్డుచెప్పరనుకో. కానీ నా వైవాహిక జీవితంలో సుఖానికి స్వస్తి చెప్పినట్లే అవుతుంది, ఒప్పుకుంటావుగదూ. ఇట్లాంటికేసు లెన్ని చూశాం!

ఒక్కొక్కప్పుడనిపిస్తోంది: వెళ్ళి ఆయన కాళ్ళమీద పడి బతిమాలి ఒప్పించుకుందామని — కాని కాపురానికి పంపక ముందే వెళ్ళి అడిగి చేదనిపించుకోవడంవల్ల ఆత్మాభిమానం దెబ్బతింటుందని భయం. కొత్తగా పత్రికొకటి పెట్టారుట. దాని అంతు తేల్చుకొని నన్ను తీసుకెళ్ళడానికింకో ఆర్నెల్లయినా పడుతుందట. ఇహ పైసంవత్సరం — అప్పటికి చదువంటే నాకున్న ఇంటరెస్టు చచ్చిపోతుంది. ఏమంటావ్? అబ్బ! ఎంత కష్టపడ్డాను స్కూల్లో ఫస్టువద్దామని! అప్పుడా విధంగా నిద్రాహారాలు ఎట్లామానేశానో నాకే ఇప్పుడాశ్చర్యంగా ఉంది. నువ్వనేదానివి 'మగపిల్లలతో మనమేం పోటీ చెయ్యగలమే? ఎందుకే. ప్యాసుమార్కులువస్తే చాలదా" అని. కాలేజీకివెడితే అక్కడ బాగా పైనవుదామని కొండంతఆశతో చదివేదాన్ని. నాన్నగారుకూడా నేనా రోజుల్లో కాలేజీసంగతి ఎత్తినప్పుడల్లా ఊగుతునేవారు. అవుననీ కాదనీ అనేవారుకారు. అప్పుడే యీసంగతి తెలిసిఉంటే అంతకష్టపడేదాన్ని కాదు. ఇప్పుడింత నిరుత్సాహపడే దాన్ని కాదు. నీకీ ఉత్తరం కాలేజీలో ఉండగా అందుతుంది. క్లాసురూములో డెస్కుచాటున పెట్టుకు చదువుకుంటావు. ఎంత అదృష్టవంతురాలివే, నీకు కాబట్టి కానీ, లేకపోతే. "నాకు చాలా అసూయగా ఉందే" అని రాయడానికి సాహసించేదాన్ని కాను.

అవునుగానీ, మీ చెల్లెలు నాతో 'ఆ సంగతి' చెప్పింది. పెళ్ళి గిళ్ళి తల్చుకున్నావా, నాగకేశికూనా. ఈ మగవాళ్ళంతా ఒకటేతీరు, వాళ్ళ తెలబారు భావాలూ, ప్రవర్తనలూ నాకిప్పుడే బాగా తెలుసు. అందుచేతనే ఏ భర్తా తనభార్యని బజార్లో నడవడానికి ఒప్పుకోడు. అట్లా ఒప్పుకునేవాడు పరమ అమాయకుడైనా కావాలి, అతివిశాలహృదయుడైనా కావాలి. కాదూ? - నామాటవిని నాకోసమైనా, ఈ ఇంటరు పూర్తయ్యేదాకా ఆగు. లేక 'అతనితో' వినయకరస్పాండెన్సు పెట్టుకొని బుర్ర పాడుచేసుకుంటే నామీద ఒట్టే నమ్మె.

ఇహనాపాలే, పాఠాలు చూడు. లెక్చరరు కోప్పడుతుంది.

---

# ఉప్పు కథ

ఉప్పుకు రుచి అని పేరు. జిహ్వాపరిజ్ఞానం వుంటే ఉప్పుసంగతి ఎరగని వారు ఉండరు. 'ఉప్పుతిన్న విశ్వాసం', అన్నది చాలాపాతకాలపు లోకోక్తి. చరిత్రలో, ముఖ్యంగా భారతదేశచరిత్రలో ఉప్పువల్ల నే విప్లవం సంభవించింది. కాగా ప్రపంచ వాణిజ్య చరిత్రలో వస్తువుల మార్పిడికి సాధనంగా, నేటి నాణాలకుమల్లే ఉప్పు చలామణీ అయిందన్న సంగతి చాలామందికి తెలిసివుండకపోవచ్చు రోమన్ సామ్రాజ్యంలో సైనికులకి ఇవ్వవలసిన జీతభత్యాలు ఉప్పు రూపంలో ఇచ్చేవారు. ఇంగ్లీషులో జీతానికి పేరు శాలరీ. ఈమాట రోమన్ భాష లోని 'శాలేరియం' అన్న పదాన్నించి వచ్చింది. శాలేరియం అంటే "ఉప్పుడబ్బు!"

## ఉప్పుతప్పనిసరి

కాగా, ఆధునిక యుగంలో సామాన్యమైన ఉప్పుకి పరిశ్రమల్లో ఎంతో ప్రాధాన్యం ఉంది. సబ్బుసోడా, సోడాపుప్పు మొదలైనవాటి తయారీలో నేమి సబ్బు, నూనె కాగితం, గాజు మొదలైన పరిశ్రమలలో నేమి దీనివాడకం జాస్తి. మొత్తం 62 ప్రధానపరిశ్రమల్లో ఉప్పుని వాడకతప్పదు.

అందుచేతనె ఒకజాతియొక్క సౌభాగ్యం లెక్కకట్టడానికి తయారుచేసే సంఖ్యాసూచిలలో ఉప్పు వాడకం, మొత్తంమీద దీని ఉత్పత్తి పరిగడిస్తారు. 1953 లో మన దేశంలో ఒక్కొక్కమనిషి 14 పౌనులు ఉప్పువాడేవాడు. ప్రపంచంలో నాటివాడకం 40 పౌనులు. అదే ఏడు ప్రపంచంలో మొత్తం ఉత్పత్తి 5 కోట్ల 60 లక్షల టన్నులు. భారతదేశంలో తయారి 31 లక్షలటన్నులు. పూర్వం ఉప్పు అంటే, ప్రభుత్వానికి కేవలం డబ్బుతెచ్చే ఒక వస్తువుమాత్రమే. దాని ఉత్పత్తివిషయం ఆ ప్రభుత్వానికి పట్టలేదు. అందుచేతనే 3,500 మైళ్ళ సముద్ర తీరం ఉన్న యీదేశం 1950 వరకున్నూ కూడా ప్రతీఏటా కొన్నిలక్షలటన్నుల ఉప్పు దిగుమతిచేసుకోవలసిన గతి పట్టింది. స్వాతంత్ర్యంవచ్చినతర్వాత భారతప్రభుత్వం ఉప్పు పరిశ్రమవిషయంలో శ్రద్ధతీసుకున్నారు.

## జలధిలో నిధి

ఇందుకే 1954 లో భావనగర్ లో కేంద్ర ఉప్పు పరిశోధనాగారం ఏర్పడింది, అనేక విధాలుగా ఇక్కడ పరిశోధన ప్రారంభం అయింది. 1. మామూలువాడకానికీ పరిశ్రమల లోనూ ఎటువంటి ఉప్పుకావాలి? 2. ఉప్పు నుంచి వేరు వేరు విలువగల రసాయనపదార్థాలను ఎలా తయారుచేయడం. 3. ఉప్పుల శ్రాణ్యం, ఇటువంటి రసాయన పదార్థాల శ్రాణ్యం నిర్ణయించడానికి పద్ధతులు. 4 వివిధ వుప్పు వుత్పత్తులను వాణిజ్య ధాయాలోకి తేవడం.

ఈదేశంలో ఉప్పు,నూరింట 70 వంతులు, సముద్రనీటినుంచి వస్తోంది. నీటినుంచి ఉప్పు తీశాక మిగిలే మూలద్రవంలో మెగ్నీషియం, పొటాషియం ఖనిజాల తాలూకు లవణ పదార్థాలు దండిగావుంటాయి. పొటాషియం క్లోరైడు మెగ్నీషియం సల్ఫేటు, మెగ్నీషియం క్లోరైడు. బ్రోమిన్ మొదలైన పదార్థాలు చవుకగా తయారుచేయడానికి యీపరిశోధనాగారం పద్ధతులు కనిపెట్టింది.

దేశంలో ఉత్పత్తి అయే ఉప్పులో నూరింట 30 వంతులు రాజస్థాన్ లోని శంభర్ సరస్సునుంచి తయారవుతోంది. ఈనీటిలో సోడియం సల్ఫేటు, సోడియం కార్బొనేటులన్న రెండువిలువైన రసాయలున్నాయి. వీటిని ఇందులోంచి తయారు చేయడానికి వెనక జరిగిన యత్నాలన్నీ వ్యర్థమయ్యాయి. ఇప్పుడీకేంద్ర పరిశోధనాగారం ఆ సమస్యపరిష్కరించింది. ఈ సరస్సులో కొన్ని చిత్రమైన నాచుమొక్కలు ఉన్నాయి. అందువల్ల ఈ నీటిలోంచి తయారయ్యే ఉప్పు రంగు, వాసనాకూడా కొంతవరకూ సరిగ్గా ఉండేదికాదు. ఆ సమస్యకూడా పరిశోధనాగారం వారు పరిష్కరించారు. మచ్చుకివచ్చే లవణపదార్థాలను, రసాయనికంగా విభజించి విలువకట్టడానికి చవక పద్ధతులుకూడా కనిపెట్టారు.

మామూలు ఉప్పుగాక, టేబుల్ సాల్టు అంటూ ఒకటివుంటుంది. అంటే బల్లలమీద పాశ్చాత్యపద్ధతులలో ఆహారం పుచ్చుకునే వారు వాడేనాజూకైన తెల్లని మెత్తని పొడిఉప్పు. మనదేశంలో దొరికే టేబుల్ సాల్టులో చాలా దుష్టగుణాలున్నాయి. ఇవన్నీ పోగొట్టి యీ ఉప్పుని గుండ్రని గుటికలరూపంలో తయారయ్యే పద్ధతిని వీరు కనిపెట్టారు. పరిశ్రమల్లో ఎంతగానో పనికి వచ్చే మెగ్నీషియం వగైరాలను తయారు చేయడానికి అక్కడపద్ధతులు కనుగొనబడ్డాయి. రకరకాల ఉపయోగాలవల్ల ఉప్పు ఏయేశాస్త్రీయమైనప్రమాణాల్లో ఉండాలో యీపరిశోధగారం నిర్ధారించింది.

ప్రస్తుత అవసరాలు భవిష్యదవసరాలు దృష్టిలో పెట్టుకుని వాడకం దార్లతోటీ, ఉత్పత్తిదార్లతోటీ సంప్రదించి ఇక్కడి పరిశోధనా కార్యక్రమం తయారుచేశారు. దేశపు ఆర్థిక స్వయంపోషకత్వానికీ, సౌభాగ్యానికి తోడ్పడగల ఉప్పుపరిశ్రమ ఉజ్జ్వలమైన భవిష్యత్తు ఏర్పర్చడంలో ఈకేంద్ర పరిశోధనాగారానికి ఎంతో ప్రధానపాత్ర వుంది. ★

## మహారాజశ్రీ మామగారికి

రిప్లై వెంటనే రాస్తావుకదూ. కాలేజీ విషయాలు చాలా రాయాలి-ఆ-వద్దులే. నాకు కష్టంగా ఉంటుంది.

మరిచిపోయినా-21 వ తేదీ నా బర్త్ డే. ప్రజెంటేషన్ ఈమాటొక ఇంగ్లీషు పుస్తకమయి ఉండాలి. మా ఇంగ్లీషు లెక్చరర్ని అడిగివిరు.

ఇక ఉంటా. నీ "రాజులు."

**2**

"సుందరి"

సచిత్ర మాసపత్రిక

ఎడిటర్ జె. లక్ష్మీనారాయణ. బి.ఎ.

మహారాజశ్రీ శ్రీధరరావు మామగారికి నమస్కారములు.

మీ ఉత్తరమంది చాలారోజులైనది. ఇక్కడ 'పత్రిక' కార్యక్రమములో నాకు తీరిక తీరకున్నది. ఉత్తరము వ్రాయుట ఆలస్యమైనందుకు క్షంతవ్యుడను.

మీకు ఇప్పుడు ఆరోగ్యముగా ఉన్నదని విని చాలా సంతోషించితిని. ఈ విషయమే నాకు తర్వు తెలియజేయగోరెదను. ముఖ్యముగా ఈ ఉత్తరము వ్రాయుటకు కారణమేమనగా, ఇదివరలో మీ అమ్మాయిని కాలేజీకి పంపుటకు నాకేమియూ ఇష్టములేదని మీకు వ్రాసియుంటినికాని ఇప్పుడు నా అభిప్రాయము మార్చుకుంటిని. ఈరోజు 25 వ తేదీ అయిఉన్నది. ఈనెల 31 వ తేదీవరకు '...' ఆడపిల్లల కాలేజీలో పిల్లలను చేర్చుకొందురని తెలుసుకొంటిని. వెంటనే మీ అమ్మాయిని అక్కడ చేర్పించే ప్రయత్నముచేయుడు. అక్కడి ప్రిన్సిపాలు నా స్నేహితునికి అక్కగారగుటచే ఆమెకు ఇక్కడినుంచి ఉత్తరము పంపితిమి. కాబట్టి మీ అమ్మాయిపేరు చెప్పగానే ఆవిడ చేర్చుకొనును. అలస్యముచేయవద్దు. త్వరపెట్టినందులకు క్షమింపుడు, కాలేజీలో చేరగానే నాకొక ఉత్తరము వెంటనే వ్రాయవలెను.

చిత్తగించవలెను,

జె. లక్ష్మీనారాయణ.

# వనితా వాణి



నా బాల్యస్నేహితురాలు ఒకామెకు గోడలు గిల్లు అలవాటుయుండేడిది. ఆ స్నేహితురాలును మరిచిపోయి చాలారోజులైనది. జ్ఞప్తికితెచ్చిన "అలవాట్లు" వ్యాస రచయిత్రికి నామనఃపూర్వకాభివందనములు తెలుపగోరుచున్నాను. టి. జయప్రజ.

నిం. ప్రభావతిగారు వ్రాసిన "ఈ వేసంగిలో" అనేదిబాగుంది. కొందరికి మామిడీపూతతోటే సెగ వేసి, మామిడిపిండెలు బజారులో రిలీజ్ అవనిముందునుంచే సెగడ్డలు లేస్తాయి మామిడీపళ్ళు ఎక్కువ. తక్కువ తినడానికి, సేత, సెగడ్డలకీ ఏమీసంబంధము లేదు. శగడ్డలు శరీరతత్వాన్ని బట్టి వస్తాయి.

"మనకు తెలియని మన అలవాట్లు" అనే వ్యాసం చాలబాగున్నది.

కె. సంధ్య, (బందరు.)

* * *

రామలక్ష్మిగారు బహు చక్కగా, అందర్నీ ఆకర్షించేలా, సమయోచితమైన పదాలతో అక్కడక్కడ హాస్యాన్నికూడా పాఠకులకు రుచిచూపిస్తూ వ్రాశారు వారి వ్యాసం రెండుపేజీలున్నా ఇంకో నాలుగైదు పేజీలుంటే బాగుండేదనిపించింది.

మన అదృశ్యరూపంలోఉండే అలవాట్లని పొరపాటుపడకుండా బహు చమత్కారంగా కాగితంమీద బొమ్మనువేసినట్లు చిత్రించారు. యం. యల్. పతి, (మంచిర్యాల.)

* * *

మా స్నేహితురాలు నవ్వితే ఆమెకు తగిన దూరములోవుండుట యెంతయో శ్రేయస్కరము ఆమె నవ్వుతూ, ప్రక్కనవున్నవారి వీపుపై ఛెళ్ళుమని దెబ్బవేస్తుంది. ఆ గురలవాటు మేము మాన్పలేకపోయినాము.

నిత్య జీవితములో జరుగువిషయములను గూర్చి చక్కగ వ్రాయుచున్న సోదరీమణులకు అభివందనములు. ఆర్. గీత, (నెల్లూరు.)

* * *

టి. రామలక్ష్మిగారు తమ చెల్లెలి స్నేహితురాలువస్తే చాప పుల్లలు ముక్కలు చేసి పోసులు పెట్టేరే అని వ్రాశారు చాపలు పాడవకుండా పాతచీరల అంచులు (చాప వెడల్పులకు) కుట్టిన చాపపుల్లలు తుంచడానికి వీలుండదు. ఎల్. సేవసేనారెడ్డి, (బుచ్చిరెడ్డిపాలెం.)

* * *

'మనకి కనిపించని మన అలవాట్లు' అన్న వ్యాసం చాలాబాగుంది. రచయిత్రి రాజ్యలక్ష్మిగారికి, నా హృదయపూర్వకాభినందనములు. ధూర్జటి బుజ్జమ్మ, (మంగళగిరి.)

* * *

"ఫలానీ ఆవిడ ఒక వ్యాసము రాసింది అని అనగానే, ఆ, ఆ, ఆమెరాసింటుందేమిటి; అన్నయ్యగానీ భర్తగానీ రాసివుంటారు అని అనేవారిని, నీకిదెంపోయేకాలమే పిల్లా" అని బుగ్గలు నొక్కుకొనే బామ్మగార్లనుచూస్తూనేవున్నాము. ఏదైనా ఒక పనిచేసినా, రచన సాగించినా," "ఉత్సాహానికి తగ్గ ప్రోత్సాహం ఉండడము అవసరము.

ఈ విషయములో రాజ్యలక్ష్మిగారు తమ వ్యాసమైన "వ్యాసాలు వ్యాఖ్యానాలు" అన్నదానిలో నిర్మొగమాటంగా చర్చించారు. వారికి నా అభినందనలు "వనితావాణి"ద్వారా తెల్పుచున్నాను.

యం. రాగమణి, (ఉరవకొండ.)

* * *

'మల్లి'గారు రాసిన "తీరనికోరికల వారివిల్లు" అనేవ్యాసం చదివాను. చాలా బాగా రాశారు. ఎంతేనా, కోరికలు తీరేవరకూవుండే ఆనందం, తీరాకవుండదు. అదే లోకసహజంకూడా! ఎవరో అన్నట్టు నిరీక్షణలోనేవుంది ఆనందం.

రవి (బరంపురం).

* * *

ఎప్పటికప్పుడు సరిక్రొత్త కోరికలు జనియించటం సహజం. కొందరు వ్యక్తులను చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. "నా జీవితంలో ఏకోరిక లేదు. ఇపుడున్నదె చాలు" అంటారు. నిజంగా వారి ఆత్మను పరిశీలించి చూస్తే ఏకోరిక లేదుఅని అనుకోవడం ఒక భ్రమ అని నా అభిప్రాయం. కోరికలకు మొదలు లేదు, అంతులేదు.

ఆర్. సుగుణ రామకృష్ణ (జగిత్యాల).

* * *

కె. లీలావతిగారు 'కలలు' అన్న వ్యాసంలో తనకు కలల మీద కంటె దూరపుకొండలమీద నునుపు జాస్తి అన్నారు. అన్నీ కాకపోయినా కొన్ని కలలు నిజంకాకపోవడంలేదు.

* * *

అమెరికా ప్రెసిడెంటు అబ్రహాంలింకన్ మరునాడు థియేటరులో గుండు దెబ్బకు ఆహుతి అవుతాడనగా క్రితం రాత్రి ఆయనకీడును సూచించే కలను గన్నట్టు చరిత్ర చెబుతున్నది. జూలియస్ సీజరు విషయంకూడ మనకు తెలిసిందే. రాత్రివచ్చినకల నాధారం చేసుకునే ఆయన భార్య సీజరును ఆరోజు యిల్లు కదలవద్దంటుంది. కాని ఆ మాట పెడచెవిని పెట్టి-వెళ్ళిన సీజరు ఘోరమరణానికి గురి అయ్యాడు. కలలు నిజమయిన సంఘటనలు యిలా ఏకరువు పెట్టుకుంటూపోతే చాలా ఉన్నాయి.

కొరుమంచి మారుతి, ఏలూరు.

కె. లీలావతిగారు వ్రాసిన వ్యాసము చదివితే బలే నవ్వువచ్చినది. అది నన్ను చాలా ఆకర్షించినది.

సి. కుసుమకుమారి (చిత్తూరు).

*  *  *

తాడూరు నాగేశ్వరరావుగారు వ్రాసిన "ఏడుకొండలవాడా వెంకటారమణా" అనే కథ చాలబాగుంది. ఎ. నాగరాజు,(ఏలూరు.)

*  *  *

టి. రామలక్ష్మిగారు వ్రాసిన మనకు తెలియని మన అలవాట్లు అన్న వ్యాసం చాలా బావుంది. అది చదివి నాకున్న ఒక చెడ్డఅలవాటును (అదేమని అడక్కండి) పోగొట్టుకున్నాను. ఆవిడకు నా ధన్యవాదాలు.

మీకెవరికేనా సన్నబడడానికి మార్గం తెలిస్తే వనితాలోకంద్వారా తెలుపుదురూ పుణ్యం ఉంటుంది.

భార్గవి (మద్రాసు.)

*  *  *

## మహిళాసంఘాలు

పశ్చిమ గోదావరిజిల్లా 'కవిటం' గ్రామంలో మే 2 న మహిళా సంఘము స్థాపించబడింది. శ్రీమతి మంతెన లీలావతమ్మ ప్రారంభోత్సవం జరిపారు. సభకు శ్రీమతి మేడపాటి బంగారమ్మ అధ్యక్షత వహించారు. శ్రీమతి నోరి అరలాలమ్మ పతాకం ఎగురవేశారు. జాతీయ జీవనంలో మహిళ స్థానము గురించి శ్రీమతులు పి. సూర్యకాంతమ్మ (సత్యవాడు పంచాయతీబోర్డు అధ్యక్షురాలు) ఎం. లీలావతమ్మ సీతాదేవి, సుశీల మొదలగువారు వుపన్యసించారు. కార్యదర్శిని శ్రీమతి గోపరాజు సీతాదేవిగారి వందన సమర్పణతో సభ ముగిసింది.

భీమవర మహిళా సంఘంవారు శ్రీ కందుకూరి వీరేశలింగ కవి జయంతి సభ ఏప్రిల్ 16 న మహిళా సంఘ భవనంలో జరిపారు. సభకు శ్రీమతి వి. సత్యవతిగారు అధ్యక్షత వహించారు. కుమారి శర్వాణి కుమారి సుశీలా ప్రార్థనగీతం పాడారు. అధ్యక్షోపన్యాసంలో కందుకూరి కవిపుంగవుని జీవిత ఘట్టాలు సంఘసేవ స్త్రీ జనోద్ధరణను గురించి వి. సత్యవతిగారు విపులముగా ఉపన్యసించారు. సంఘం ఉపాధ్యక్షురాలు శ్రీమతి మోచర్ల సుబ్బలక్ష్మి వీరేశలింగం పంతులుగారి కవితా విభవాన్ని గురించి స్త్రీ విద్యాభివృద్ధికోసం పంతులుగారు చేసిన పనులను గురించి మాట్లాడారు. చిరంజీవి మోచర్ల శ్రీ హరికృష్ణ వీరేశలింగ కవిమీద పద్యాలు చదివాడు. కుమారి శర్వాణి కుమారి సుశీలా కందుకూరి సుందరమ్మగారలు ఉపన్యసించారు. బాలికలు నృత్యం ప్రదర్శించారు. కందుకూరి సుందరమ్మగారి మనుమరాంద్రు భగవద్గీత బుద్ధకథ అతి మనోహరంగా చెప్పేరు. శ్రీమతి పాలగ్రామర జయరామారావుగారి వందనసమర్పణతో స్త్రీజన బాంధవుడు శ్రీ కందుకూరి కవివరేణ్యుని జయంతిసభ జయప్రదముగా ముగిసినది.

*  *  *

## మామిడిపండ్ల నిలవ

వేసవి వచ్చింది. అంటే మామిడిపండ్లు వచ్చాయన్న మాట. మైసూరులోవున్న కేంద్ర ఆహార సాంకేతిక పరిశోధనాగారం రకరకాల మామిడిపండ్లను రంగు, పరిమళము, రుచి నిలిచేటట్లు నిలవచేసే పద్ధతులు కనుక్కుంటున్నారంటే మామిడిపండ్లని అప్యాయంగా పుచ్చుకునే వారందరికి ఒక విశేషంగానే లభిస్తుంది. ఈ కేంద్రంలో పండ్లూ కూరగాయలూ నిలవచేసే పద్ధతులు కనిపెట్టడం పరిశోధనలో ఒక ప్రధానాంశం. ఒక్క మామిడిపండ్ల విషయంలోనేకాక టొమాటో గుజ్జూ, కొన్నిరకాల బటానీలూ డబ్బాలో నిలవచేసే పద్ధతి, చెడకుండా చేపలు నిలవచేసే పద్ధతి గురించి కూడా పరిశోధనలు జరుగుతున్నాయి.

ముందు ముందు ఈ పరిశోధన ఇంకా దేశవ్యాప్తంగా సాగుతుంది. మైసూరు పరిశోధనాగారం ఆధ్వర్యంక్రింద ఆంధ్రప్రదేశ్ లో కొడూరుదగ్గర ఒక ప్రాంతీయ పరిశోధనాగారం ఏర్పరుస్తారు. ఢిల్లీ, పూనా, గౌహతి, సిమ్లా, వహరన్పూర్లవద్ద కొడూరు కేంద్రం లాంటివి మరొక 5, నాగపూర్, తిరుచూర్, కులు, జాదవ్ పూర్ లవద్ద 4 చిన్న కేంద్రాలో ఏర్పడతాయి.

## 'తివిరి యిసుమున...'

(36-వ పేజీ తరువాయి)

వచ్చు. కొందఱు ప్రతి చిన్న పనివాళ్లు చేసినదే రూలు' అంటారు. ఇక ఆచారాల గొడవ వస్తే చెప్పనవసరంలేదు. అందుచేత 'మూర్ఖత'కు సంబంధించిన సమస్యలు చాల వస్తూ ఉంటాయి. కూరలవాళ్లున్నారు.నయా పైసల లెక్కవాళ్ళకి చెప్పలేక చావాలి. ఇలాగే పనిమనుషులు, పాలవాళ్ళు అందరూను 'విద్యా విహీనః పశుః' అని చదువూ సంస్కారంలేనివాళ్ళకి మూర్ఖత చాల ఎక్కువగా ఉంటుంది

ఇక 'చదువుకున్న మూర్ఖులు' న్నారు. వాళ్ళతో వేగడం మరీ కష్టం. దంపతులలో ఏ వొక్కరు మూర్ఖులైనా వారి రెండు జీవితాలూ దుఃఖభాజనాలవుతాయి. 'ఆఫీసరు' మూర్ఖుడైతే క్రిందివారికి 'ఆఫీసు' భూలోక నరకం మూర్ఖతవల్ల కొన్ని లాభాలుకూడా ఉన్నాయి.

ఆ మధ్య మేము మా 'వేలువిడిచినమామ' గారింటికి వెళ్ళేము. అవేళ శనివారం. అది పల్లెటూరు. సాయంత్రం అయ్యేసరికి మామయ్యగారి ఇంటి గుమ్మంలో ఊరివాళ్ళు ఒక 50 మంది పిల్లా, పెద్దా, ఆడా మగా అందరూ వచ్చేరు. నేనాశ్చర్యంగా చూచి అతను 'ఏమిటి విశేషం' అని అడిగేను. వెంకటేశ్వర్లుకి భజన చేస్తారని చెప్పేరు. అత్త, మామ మడికట్టుకు దీపధూప నైవేద్యాలు అమర్చేరు. ఒక రెండు గంటలు భజనసాగింది. అన్నీ. మామయ్య చేసిన పాటలేనట. కొన్ని సినీ సంగీతపు బాణీలలో కూడా ఉన్నాయి. 'సీతా! హిమశైల జాతా' అని అంత్యప్రాసలతో ఒకపాట కూడా ఉంది. అందరూ వెళ్ళేక 'మామయ్యా! జానుకాని సీత హిమశైల జాత అంటావేమిటి'? అన్నాను. 'అది కాదమ్మా వాళ్ళకి అనడానికి, వినడానికీ ఇంపుగా ఉండే పాటలు కావాలి. దాల్లో సారస్వతం అక్కర్లేదు అన్నాడు. నేను చిరునవ్వు నవ్వి ఊరుకున్నాను. ఆవేళ మామయ్యకు ఎన్ని కానుకలు ఇచ్చేరో వాళ్ళు-వాళ్ళకు మామయ్య అంటే ఎంత భక్తి అనుకున్నారు? 'కవిగారు' అని వ్రాసి ఆ ఊరుపేరు వ్రాస్తే మామయ్యకు లెటరు వెళ్లి పోవలసిందే.

'ఈ వ్యాసం ఎందుకు వ్రాశారు? ఏమిటి ఉపయోగం' అంటారేమో-స్త్రీలకు సమిష్టి కుటుంబాలలో నైతే నేమి వేరుగా సంఘంలో నైతేనేమి ఇలాటి పరిస్థితులు తటస్థపడుతాయి. సాధారణంగా 'పెద్దవాళ్ళు' అత్తగారు, మామగారులాటివారు-వాళ్ళు చెప్పిన పనులు వాళ్లు చెప్పిన క్రమంలోనే చెయ్యాలనీ, ఇలా వాదిస్తే మనం కోపగించుకోక ఊరుకోడం మంచిది. ఒకొక్కసారి పెద్దవాళ్ళు మూర్ఖులని తిట్టుకుంటూ ఏదో ఒక విషయంమీద చివరకు మనమే మూర్ఖులమని తేలవచ్చు. తొందర తగదు. మా తాతయ్య మా చిన్నాన్నను బజారుకిపంపి, ఏ పదిరూపాయలనోటు ఏ వస్తువు కొంటూ మార్చేడో చెప్పమనేవాడు. పూర్తి లెక్క చెప్పి మిగిలిన డబ్బిస్తే చాలదుట-అలాగే చెప్పేవాడు పాపం మా చిన్నాన్న-కనుక మన నిత్యజీవితంలో మనం కూడ అలాగ సర్దుకుపోవడం నేర్చుకోడం (విశేషించి స్త్రీలకు)ఎంతేనా అవసరం. ★

# ★ అన్వేషణ ★

32-వ పేజీ తరువాయి

మాధవరావును మక్కువగా చూచిన శారదకు అతని ధనం, అందం, హోదా, ఆమెను యింకా ఎక్కువ ఆకర్షించి అతనికి దగ్గరిగా తీసుకువెళ్ళాయి. శారద ప్రక్కనే మాధవరావును సినిమాలో చూడగానే మాత్సర్యంతో మనస్సులోనే బాధపడ్డాడు శివరాం.

కొంతకాలం శివరాం శారదతో మాట్లాడలేదు కోపంతో. అతని కోపం లెక్కచేసినట్లు కనబడలేదు శారద. అంతటితో శివరాం గుండెల్లో బల్లెం పుచ్చుకొని పొడిచినంతగా బాధపడ్డాడు.

బి. ఏ. పరీక్షలై పోయాయి. ఇంక దినచర్యలో ముఖ్యమైన చదువు ముగియడంతో, తీరిక పెరిగి, శివరాం మనస్సు శారదను గురించి పరిపరివిధాల ఆలోచించింది. కోపంతో శారదతో మాట్లాడడం మానినందుకు నొచ్చుకున్నాడు.

ఒకరోజు శారదను చూడాలని చిట్టెమ్మ యింటికి వెళ్ళాడు శివరాం.

శారద తన స్నేహితులతో పేకాడుతూ కూర్చుంది. శివరాం వచ్చిన సంగతి గమనించీ గమనించనట్లు ఊరకుంది. శివరాం, అలమారులోని నవలతీసుకొని చదువుతూ కాస్సేపు కూర్చున్నాడు. మరికొంతసేపు చిట్టెమ్మతో ఏవో కబుర్లు చెప్పాడు.

స్నేహితులు వెళ్ళిపోయాక, శారద తన గదిలోకి వెళ్ళింది. శివరాం ఆమెను అనుసరించాడు.

'శారదా!'

మౌనం వహించింది శారద.

'నీతో మాట్లాడాలి!'

'ఏమిటది?.. ఎందుకు?!' కసిరింది శారద.

'నీతో యింతకాలం మాట్లాడనందుకు, క్షమాపణం చెప్పుకుంటున్నా!'

'అనవసరం!' కటువుగా మాట త్రెంచింది శారద.

'శారదా!'...ఆప్యాయంగా జాలిగా, దీనంగా శివరాం శారదకు దగ్గరగా వెళ్ళాడు,

"ఇకనుంచి నా గదిలోకి రావద్దు!" ముఖం త్రిప్పుకుని కిటికీలోంచి వీధిలోకి చూచింది శారద.

"శారదా!...క్షమాపణ చెప్పుకుంటున్నా...!" శివరాం మాటలు నమిలాడు. మౌనంగా తన పెట్టెలో చీరలు వెతుకుతూ ఏరుతోంది శారద.

'శారద!...నువ్వు ఒప్పుకుంటే...మన పెళ్ళి.. తాతయ్యతో చెబుతాను.'

'ఏమిటి?' గట్టిగా అరిచింది శారద.

ఆమె కండ్లు చింతనిప్పుల్లా ఎర్రబడ్డాయి.

'శివరాం!...నన్ను అనవసరంగా విసిగించకు. నువ్వు వెళ్ళు!' శారద దఢేలున పెట్టెమూసి, ఒక సిల్కు చీర తీసుకొని మరో గదిలోకి వెళ్ళిపోయింది.

'బావా' అని పిలిచే శారద పేరుపెట్టి సంబోధించినందుకు చకితుడయ్యాడు శివరాం.

మాధవరావు స్నేహంవల్ల, శివరాంకు అసూయ కలిగి మాట్లాడం మానేశాడని గుర్తించిన శారద ఏమీ విచారించలేదు. ఆమె కళ్ళకు శివరాంకన్న మాధవరావే ఎన్నోవిధాల తగిన స్నేహితుడిలా కనిపించాడు. అవసరమైతే మాధవరావుతో స్నేహం పెంచుకుని, పెండ్లి చేసుకోవాలనే కోరిక కూడ కల్గింది శారదకు.

కాలం మార్పుతోపాటు మనస్సులోని కోర్కెలు కూడా మార్చుకున్న శారద శివరాంతో ఘర్షణ పెట్టుకోదలిచింది. కనిపించిన శివరాంను నిరసనతో చూసి కదిలిపోయింది.

మళ్ళీ శారద వచ్చి మాట్లాడుతుందనుకొని మౌనంగా నిలుచుని ఏదో పుస్తకంలోకి పరధ్యాన్నంగా చూస్తూ పేజీలు త్రిప్పేడు శివరాం కాస్సేపు. గులాబీ సిల్కు చీర, నల్లని రవిక తొడుక్కుని ఎత్తుమడమల స్లిప్పరుతో, చేతిలో వేనిటీబేగ్ పట్టుకుని, బర్మా

కొప్పులో తురుముకున్న మల్లెదండలు సరి చూసుకుంటూ 'అమ్మమ్మా! నేను సినిమాకు వెడుతున్నా'నంటూ! శివరాం కళ్ళ ఎదుటే గర్వంగా వెళ్ళిపోయింది శారద.

శివరాం బాధతో కుమిలిపోయేడు. హృదయంలో ఎంతో అనురాగం పెంచుకుని శారదగురించి తన భావి జీవితంలో ఎన్నో కలలుకన్న శివరాం ఒంటరిగా పార్కుకు పోయి ఒక మూల కూర్చొని వెక్కి వెక్కి ఏడ్చాడు. శరీరమంతా సూదులు గ్రుచ్చుకున్నట్లు మూలేడు. జీవితంలో పూర్తి ఆనందం కోలుపోయినట్లు దురపిల్లాడు: మాధవరావును హత్య చేయాలన్నంత ఉద్వేగంతో రోషంతో, ఉద్రేకంతో కంపించిపోయాడు.

మరోసారి శారదను మనసార పలకరించి మాట్లాడాలని మర్నాడు శివరాం ఆమె యింటికి మళ్ళీ వెళ్ళాడు.

'శారదా!... నేను సినిమాకు వెడుతున్నా... వస్తావా!'

'రాను!'

శివరాం ఉండేలు దెబ్బతిన్న పక్షిలా లోలోపల బాధతో గిలగిల కొట్టుకున్నాడు.

'శారదా... ఇంక... యింతేనా?'

'ఆ...ఇంతే!' ముభావంగా కటువుగా సమాధాన మిచ్చింది ఆమె.

స్త్రీ హృదయాన్ని అర్థం చేసుకోడం కష్టం అనే సంగతి శివరాంకు దృఢపడింది. మనిషి నడత వెనుకాల దాగొన్న మనస్సులోని భావాలు పరిశోధించడం, అర్థం చేసుకోవటం వాటికి అనుగుణ్యంగా నడుచుకోవడం ఒక పెద్ద కళ. స్త్రీ హృదయానికి దగ్గరగా చేరాలంటే యీ కళలో నేర్పు చాలా అవసరం. బ్రతుకులోని ప్రథమ పాదంలో తారసిల్లిన ఆడదానితో ఏర్పడిన సంఘర్షణను ఏ విధంగా తప్పించుకోవాలో అర్థం కాలేదు శివరాంకు.

'శారదా... వెళ్ళి పొమ్మన్నావా!'

'మంచిది.'

'మళ్ళా రావద్దా?'

'ఎవరికోసం... ఎందుకు?' వ్యంగ్యంగా హేళనగా నవ్వింది శారద.

ప్రేమను తిరస్కరించి అవమానం చేస్తున్న ఆ ఆడదాన్ని ఏ విధంగా హింసించాలా అనే క్రోధంతో సతమత మయ్యాడు శివరాం. సక్రమంగా ప్రేమను మార్చుకుని జీవితగతిని దిద్దుకుంటానన్న యువతిని అర్థం చేసుకొని వదిలివేయవచ్చుగాని, అహంకారంతో, గర్వంతో ప్రేమికుని అవమాన పరచ నుంకించిన స్త్రీపై ఏ ప్రతీకారం చేస్తే బాగుంటుంది అనే తీవ్రాలోచనలో పడ్డాడు శివరాం.

'లక్ష్మీ!... శారద మనయింటికి రావటం లేదే!' మర్నాడు చెల్లెలుతో ప్రసంగము కదిపాడు శివరాం. చెల్లెలు ద్వారానైనా శారదను మచ్చిక చేసుకుని మునుపటి స్నేహాను పెంచుకోవాలనే కోరిక శివరాంకు కలిగింది.

'ఏమో!... నేను రమ్మన్నాను... కానీ రావటంలేదు!' అన్నయ్య మనస్తత్వం కొద్దిగా అర్థం చేసుకున్న లక్ష్మి తనవల్ల ఏమీ కాదని ముభావంగా ఊరుకుంది.

బ్రహ్మయ్యగారికి ఒక రోజు ప్రొద్దున్న ఒక విచిత్రమైన ఆలోచన తట్టింది. తక్షణం సుభద్రమ్మ దగ్గరికి వెళ్ళాడు.

'అమ్మాయీ!... మన శివరాంకు పెళ్ళి చేయాలని ఉంది!' అన్నారు ముక్కుపొడుము పీలుస్తూ.

'మీ యిష్టం!' మర్యాదగా మామగారికి సమాధానమిచ్చింది సుభద్రమ్మ.

'మనవాడి బి. ఏ., యీఏడు పూర్తయిపోతుంది. శారదకు ఇంటర్ పరీక్ష అయిపోయింది. ఆడదానికి ఇంకా చదువులెందుకూ... పైగా వాళ్ళిద్దరు చాలాస్నేహంగా వున్నట్లు కనిపించారు... నీ కిష్టమైతే చిట్టెమ్మతో మాట్లాడతా!...'

సుభద్రమ్మ తన కొడుకు మనస్సు కొంత వరకు అర్థం చేసుకుంది. శారద యీ మధ్య తమ యింటికి రాకపోవడం, శివరాం దీనముగా, పరధ్యానంగా ఆలోచనలతో రోజులు గడుపుతూండడం పరికించిన సుభద్రమ్మ మామగారితో మాత్రం తన మనస్సులోని అనుమానం చెప్పదలుచుకోలేదు. బ్రహ్మయ్యగారు పెళ్ళిసంగతి కదిపితే పిల్లలు కోపాలుతగ్గి, తిరిగి ఆనందంగా కలుసుకుంటారని ఆశించింది సుభద్రమ్మ.

—ఇంకావుంది]

# బాలసాహితి

## చిన్న చూపు!

చిన్నవాడినని చులకనచేస్తూ
వేధిస్తూంటా రంతా నన్నూ—
చేరదీసి ఓమాట పలికితే
చెడిపోతానేమో మరినేను!

నాలుగుమాటలు విన్నంతనే నే
నాకిందా నైపోతానా?
నలుగురి నీడలు నాపై పడితే
కానివాడినై పోతానా?

బంధువులెవరైనా ఇటువస్తే
ఆరా లెందుకు నన్నుగురించీ?
చిరునవ్వులతో చేరబోవగా
వారిస్తుంటా రెందుకునన్నూ?

చేరనీక నను నిర్బంధిస్తే
ఒరిగేదేమిటి, ఈ పెద్దలకు?
ఎవరైనా తమ ఇంటికివస్తే
చదివేయాలా మంచిబాలురు?

సరదాగా ఒకపూట బడిమాని
తిరిగేస్తే మరి ఏమౌతుందో?
రాక రాక వచ్చేసిన చుట్టాల్—
నేనటలేనని చిన్నబుచ్చుకుని
తిరిగిపోతే — మరి చేసేదేమిటి?

పెద్దవాళ్ళ కన లేమీ తెలియదు.
పోనీ తెమ్మని చెప్పబోవగా
మంచి చెడ్డలను ఎరగని వీరూ
ఛో పొమ్మంటూ కసిరేస్తారు!

 "మురళి" 

# కీరసందేశం

కొన్ని వందల సంవత్సరాలనాటి మాట. ఇరాకు దేశంలో ఒక వర్తకుడుండేవాడు. వర్తకం పనిమీద అనేక దేశాలు వెళ్లి వస్తుండేవాడు. వెళ్లిన ప్రతి కొత్త దేశం నుంచీ, కుటుంబంలోని ప్రతి ఒకరికీ ఏదో ఒక వస్తువు బహుమతిగా తెస్తూ ఉండేవాడు.

ఒక పర్యాయం వర్తకుడు భారత దేశ యాత్రకు బయలు దేరాడు. బయలుదేరబోయే ముందు తన పాత అలవాటుప్రకారం ఇంట్లోని వాళ్లందర్నీ 'నీకేంకావాలంటే నీకేంకావా' లని పేరు పేరునా పిలిచి అడిగి తెలుసుకున్నాడు. వాకిలిదాటి బయట అడుగు పెట్టేటప్పటికి వసారాలోని పంజరంలోని చిలుక పలుకరించింది. ఆ చిలుకను ఆవ్యాపారి క్రిందటిసారి భారత దేశం వెళ్లినప్పుడు కొని తెచ్చాడు. "ఏం రామయ్యా! నీ జన్మస్థానం నుంచి నీకేంకావాలో కోరుకో! తెచ్చిపెడతాను," అని వ్యాపారి పంజరం దగ్గిరకెళ్లి నిలబడ్డాడు.

"ఏమీలేదు, భారత దేశంలో మీకు కన్పించిన చిలుకలతో చెప్పండి. "మీవా డొకడు ఇరాకు దేశంలో బానిసగా బతుకుతున్నాడు. వాడి విముక్తికి సాధనం తెల్పండి. అని."

వ్యాపారి నవ్వాడు 'నీకేమిటి, స్వాతంత్ర్యమేమిటీ' అన్నట్టుగా!

"సరే చెప్పావు గనుక, అట్లాగే చేస్తాను!" అని చిలుకకు సమాధానం చెప్పి వ్యాపారి భారత దేశానికి బయలు దేరి వెళ్లాడు.

డి. యం. ధర్

పని ముగించుకొని స్వదేశం తిరిగి వస్తుండగా దారిలో ఒకచోట ఒక చిలుకల గుంపు వ్యాపారికి కన్పించింది. వెంటనే వ్యాపారికి తనచిలుక చెప్పిన సందేశం స్మృతికి వచ్చింది. అతడు భారత దేశపు చిలుకలదండును ఉద్దేశించి ఇలా అన్నాడు. "మీవా డొకడు ఇరాకు దేశంలో బానిసగా బతుకు'తున్నాడు. వాడి విముక్తికి సాధనం తెల్పండి!"

ఈ మాట వినీ వినటంతోటే గుంపులోని ఒక చిలుక ఉన్న పళంగా వెనక్కు ఒరిగింది! 'పాపం ఈ చిలుకకూ, నాదగ్గిరున్న చిలుకకూ ఏదో

రంగుల రాట్నం-5. వాల్ట్ డిస్నీ




"బట్వాడాలన్నీ పెరటివేపునే..."

## ★ కీరసందేశం

బంధుత్వం ఉండి ఉంటుంది...... అందుకే వెంటనే చనిపోయింది!' అని వ్యాపారి నేలకూలిన చిలుకను చూసి ఆలోచించాడు.

వ్యాపారి ఇరాకు దేశం చేరుకున్నాడు. ఇంట్లోని వాళ్లందరికీ అన్ని బహుమానాలూ పంచిపెట్టి చివరకు విచార వదనంతో వసారాలోవున్న పంజరం దగ్గరకు వచ్చి చిలుకతో చెప్పాడు:

"ఏమయ్యోయ్ రామయ్యా! నువ్వు చెప్పినట్టే చేశాను; కాని ఎవరో తెలియదు- నీకు భార్య అవుతుందో ఏమో - ఒకచిలుక ఈవార్త వినగానే నేలమీద కొరిగిపోయింది. పాపం! ఇంతకంటే నీకు భారతదేశం నుంచి తెచ్చిందేమీ లేదు!"

వ్యాపారి తనమాటలు ముగించాడో లేదో పంజరంలోని చిలుక కూడా సరిగ్గా భారతదేశంలో నేల కొరిగిన చిలుకకు మల్లేనే వున్న పళంగా వెనక్కు ఒరిగింది! వ్యాపారికి చాలా బాధవేసింది. 'పాపం రామయ్య కూడా బాధకు తాళ జాలక ప్రాణత్యాగం చేశాడు!'అని విచారిస్తూ పంజరాన్ని తెరిచి చిలుకను తీసి బయటికి విసిరాడు.

చిలుక రెక్కలాడించుకుంటూ ఆకాశంమీది కెగిరింది. వ్యాపారికి ఆశ్చర్యమేసింది. "మీరు భారతదేశంనుంచి నాకోసం స్వాతంత్ర్య సాధన రహస్యాన్ని తీసుకొచ్చారు మీ మేలును నేను మరువలేను"— అన్న చిలుకమాటలు వ్యాపారికి విన్పించాయి. ★

---

ఆఫీసరు: (గుమాస్తాలతో) మీలో బద్ధకస్తులు ఒక మారు చెయ్యెత్తండి!

ఒకడు తప్ప తతిమా వారందరు చేతులెత్తారు. అతన్ని ఉద్దేశించి ఆఫీసరు ఇలా అన్నాడు!

ఆఫీసర్: ఏమోయ్! నువ్వు చెయ్యెత్తలేదేం? నీకు బద్ధకం లేదా?

అతడు: నాకు చెయ్యెత్తటానికి కూడా బద్ధకమే సార్!

వి. రామారావు, కాకినాడ.

---

### ఆంధ్ర సచిత్ర వారపత్రిక
### బాలల సంఘం

GROUP A లేక B

[సభ్యత్వపు దరఖాస్తు]

సభ్యుని (సభ్యురాలి) పూర్తిపేరు (విడివిడి అక్షరాలలో) ....

పుట్టినతేదీ, నెల, సంవత్సరం: జులై 1 నాటికి వయస్సు ....

తండ్రి, లేక, సంరక్షకుని పూర్తి పేరు ....

ఊరి పేరు, జిల్లా, తాలూకా, పోస్టు [వీథి: నెంబరు] ....

* చదువుతున్న తరగతి, లేక, ఫారము: ....

పాఠశాల పేరు ....

ప్రధానోపాధ్యాయునిపేరు (తెలిస్తే):

ఆర్యా:

ఆంధ్ర సచిత్ర వారపత్రిక బాలల సంఘములో నన్ను సభ్యునిగా/సభ్యురాలుగా చేర్చుకొన ప్రార్థన. పైన వ్రాసిన విషయాలన్నీ యదార్థములు.

ఇట్లు

[తేదీ: -1959]

(సంతకము)

* మరొ: ఏ పాఠశాలలోనూగాక ఇంటివద్దనే ట్యూషన్ చెప్పించుకొనే బాలబాలికలు కూడా సభ్యులుగా చేరవచ్చు. 'చదువుతున్న తరగతి' అనే విషయానికి ఎదురుగా 'ప్రైవేట్ స్టడీ' అని వ్రాయాలి.

సంచిక: **20-5-59**] ఈ దరఖాస్తు **23-5-59** నాటికి మాకు చేరాలి |

# బాలల సంఘం

# కొందరు సభ్యుల పేర్లు

61 ఆర్. గోవిందరావు (ముస్తాబాద్ కరీంనగరంజిల్లా) 62 లచ్చిరెడ్డి రామకృష్ణ నాయుడు (రాలివలస శ్రీకాకుళంజిల్లా) 63 ఎస్. రవిప్రకాష్‌యాదవ్ (ఢిల్లీ) 64 వి. జె. ఎ. ఆశీర్వాదం (నంద్యాల) 65 రామినేని వెంకటేశ్వరప్రసాద్ (అచ్చమ్మపేట గుంటూరుజిల్లా) 66 వంకాయల రాజ్యలక్ష్మి (విజయనగరము) 67 కార్యంపూడి ఫణీంద్రుడు (పటమట కృష్ణాజిల్లా) 68 నూతాపజ్జల లక్ష్మీకస్తూరిబాయి (బరంపురము) 69 అల్లంరాజు సత్యవతి (ఉప్పాడ తూ. గో. జిల్లా) 70 కరెడ్ల స్వరాజ్యలక్ష్మి (కొండముగి, గుంటూరుజిల్లా) 71 గోటేటి స్వరాజ్యలక్ష్మి (శ్రీకాకుళం) 72 మండా సీతానాగరాజకుమారి (మాజేరు) 73 గణపవరపు వెంకట ఆంజనేయశాస్త్రి (గుంటూరు) 74 తిరుమూర్తి వెంకటరామారావు (విశాఖపట్నము) 75 గణపవరపు విజయలక్ష్మి (గుంటూరు) 76 భోగి సన్యాసిరావు (కురుపాం శ్రీకాకుళంజిల్లా) 77 పచ్చిగోళ్ల వెంకటస్వామిప్రసాద్ (విజయవాడ కృష్ణాజిల్లా) 78 కోణకంచి శ్రీకృష్ణప్రసాద్ (విజయవాడ) 79 ఆచంట ప్రేమకుమారి (విజయవాడ) 80 మూలి సత్యభామ (కటక్)

81 ఇల్లిందల ప్రభాకరరావు (న్యూఢిల్లీ) 82 మద్ది యోగేశ్వరరావు (తెనాలి) 83 మేదర యాదగిరి (కొరెకుంట వరంగల్లుజిల్లా) 84 మాగంటి భారతలక్ష్మి (పెదకొండూరు గుంటూరుజిల్లా) 85 చిక్కాల వీరాస్వామి (తాటిపాక తూ. గో. జిల్లా) 86 యల్లాప్రగడ నాగేశ్వరరావు (పెదకొత్తపల్లి గుంటూరుజిల్లా) 87 డి. బాలధంజక (ఏలూరు) 88 కందేటి కులశేఖరఅల్వార్ (మచిలీపట్నం కృష్ణాజిల్లా) 89 మున్నవ రుక్మిణీదేవి (బొంబాయి) 90 చిర్రావూరి జగన్నాథ్ (న్యూఢిల్లీ) 91 పాతూరి ఉమాకుమారి (హైద్రాబాదు) 92 బోనాల బాలాత్రిపుర సుందరి (నర్సీపట్నం విశాఖజిల్లా) 93 కొంతి వెంకటరాజామణి విశాఖపట్నము) 94 మెట్టా శ్యామసుందర కృష్ణమూర్తి (కరేడు నెల్లూరుజిల్లా) 95 అన్నదానం శివపార్వతి (హైదరాబాదు) 96 కోడూరి రమామణి (విజయవాడ) 97 కాశీ విజయలక్ష్మి (నెల్లూరు) 98 గుంటూరి విశ్వేశ్వరశాస్త్రి (బాపట్ల) 99 సోమంచి సత్యనారాయణ (రాజమండ్రి) 100 సోమంచి పూర్ణచంద్రరావు (రాజమండ్రి.)

101 చిర్రావూరి విశాలాక్షి (న్యూఢిల్లీ) 102 వింజనంపాటి సూర్యకుమారి (నర్సారావుపేట గుంటూరుజిల్లా) 103 ప్రథల రాధ (బొంబాయి) 104 డి. వి. సుబ్రహ్మణ్యం (మద్రాసు) 105 వెందులూరి సుబ్బరాయశర్మ (కొత్తపేట తూ. గో. జిల్లా) 106 కొండాలక్ష్మి హనుమాన్ ప్రసూనాంబ (పొన్నెకల్లు గుంటూరుజిల్లా) 107 పూటుమూరి హనుమంతరావు (కురగల్లు గుంటూరు జిల్లా) 108 ప్రయాగ ధనలక్ష్మి (రాజోలు తూ. గో. జిల్లా) 109 వాడికొండ శంకరరావు (మచిలీపట్నము) 110 అంకరాజు రత్నసుందరిదేవి (కొట్టపూడి గుంటూరు జిల్లా) 111 మల్లాది వెంకటలలిత కుమారి (కాకినాడ) 112 తేజోమూర్తుల నాగమణి (కాకినాడ) 113 డి. శచీదేవి (నల్లగొండ) 114 జి. నిర్మల (గుంటూరు) 115 చలంచాల వెంకటసాయిప్రసాద్ (పెరంబూరు, మద్రాసు) 116 పిల్లలమర్రి శేషశాయి (విజయవాడ) 117 నలాది లత (ఏలూరు) 118 ఎర్రమల్లి శ్యామలరావు (జంషెడ్‌పూర్) 119 విస్సా రాధాకృష్ణ (రాజోలు తూ. గో. జిల్లా) 120 కాశీభట్ల గోపాలకృష్ణప్రసాద్ (చీరాల.)

121 కారంచేటి సోమయాజులు (గజపతినగరం విశాఖజిల్లా) 122 నూరిశెట్టి కాశీ అన్నపూర్ణమ్మ (ఖజిడిదస్‌బాద్ జిల్లా) 123 యాబలూరి చలపతిరావు (దేవరకొండ నల్లగొండజిల్లా) 124 వారణాశి దుర్గారామలక్ష్మి (విశాఖపట్నం) 125 అనుమర్లపూడి అమరనాథ (హైదరాబాదు) 126 జి. కనకవల్లి (గుంటూరు) 127 చీర్ల లోకేశ్వరరావు (నెల్లూరు) 128 యిరుబండి సూర్యప్రభావతి (ఈదరాడ తూ. గో. జిల్లా) 129 మైలవరపు దుర్గాప్రసాద్ (విజయవాడ) 130 ఆర్. యతిరాజకుమార్ (అనపర్తి తూ. గో. జిల్లా) 131 పి. సురేంద్రకుమార్ రెడ్డి (పాలకల చిత్తూరుజిల్లా) 132 వి. ఆంజనేయప్రసాద్ (తిరుపతి చిత్తూరుజిల్లా) 133 ఉప్పల సావిత్రీదేవి (నాగాయలంక కృష్ణాజిల్లా) 134 చిన్ని పద్మావతి (శృంగవరపుకోట విశాఖజిల్లా) 135 పాలావజ్ఝుల సంపూర్ణ భానుకామేశ్వరి (చినయరుకపాడు కృష్ణాజిల్లా) 136 సుంకరలత (రాజమండ్రి) 137 ఎమ్. పార్థసారథి (తిరుపతి, చిత్తూరుజిల్లా) 138 జి. వి. రామారావు (విజయవాడ) 139 విష్ణువజ్ఝుల రుక్మిణీదేవి (రాజమండ్రి) 140 ఆదిరాజు వెంకటరంగారావు (సికింద్రాబాదు)

141 అబ్బూరి మహాలక్ష్మి (కాకినాడ) 142 దువ్వూరి లలితారెడ్డి (సత్యవేడు చెంగల్పట్టుజిల్లా) 143 నంబూరి సురేశచంద్రదత్తు (నూదికొండ తూ. గో. జిల్లా) 144 అరవల లక్ష్మీనారాయణరావు (కాకినాడ) 145 మాగూరు సంజీవరావు (రంగాపురం, మహబూబ్‌నగర్ జిల్లా) 146 కొత్తపల్లి నాగరత్నం (వాకాడ తూ. గో. జిల్లా) 147 నందగిరి జానకీదేవి (కోట్‌పాడ్ కోరాపుట్టి జిల్లా) 148 వోలేటి రామకృష్ణ (రాజమండ్రి) 149 కన్నెగంటి మోహన్‌చంద్ (విజయవాడ) 150 పాటిబండ్ల సామ్రాజ్యలక్ష్మి (చేబ్రోలు గుంటూరుజిల్లా) 151 గొల్లపల్లి నాగసూర్యప్రభ (విజయవాడ) 152 మహరుఖ్ (నరసన్నపేట శ్రీకాకుళంజిల్లా) 153 మంగిపూడి వెంకటసత్యనారాయణమూర్తి (చోడవరం విశాఖజిల్లా) 154 సోమయాజుల దక్షిణామూర్తి (మద్రాసు) 155 అయ్యగారి సుందరవెంకటజగన్నాథరావు (రాజమండ్రి) 156 అంగరరమణ గోపాలరావు (న్యూఢిల్లీ) 157 మానిశెట్టి చినవెంకటేశ్వరరావు (ఏలూరు) 158 వేమూరి లక్ష్మీనారాయణ (తాడేపల్లిగూడెం ప. గో. జిల్లా) 159 జి. రఘుపతి (మందిన్రగామం కరీంనగరంజిల్లా) 160 కుమారి నర్గీస్ వరం (విజయనగరం.)

161. కరణం వరలక్ష్మి (కడవకుదురు గుంటూరుజిల్లా) 162. పిట్టా అదిలక్ష్మి (కదమా జంషెడ్‌పూర్) 163. కర్రా సుబ్బలక్ష్మి (వానపల్లి తూ. గో. జిల్లా) 164. నెక్కలపు సూర్యచంద్రవరప్రసాదరావు (వైకరము ప. గో. జిల్లా) 165. తమిరి నాగదేవరావు (సాలూరు శ్రీకాకుళంజిల్లా) 166. చింతలపాటి శివరామకృష్ణ (కలిదిండి కృష్ణాజిల్లా) 167. గుండు వెంకటనరసింహం (శిరిపూడి గుంటూరుజిల్లా) 168. చీర్ల లక్ష్మీకాంతం (తాటిపాక తూ. గో. జిల్లా) 169. కృష్ణమూర్తి (ముజాహిదాపురం హైద్రాబాదు) 170. సరిజ లలితకుమారి (విజయవాడ) 171. బుద్ధా నాగేశ్వరరావు (అనకాపల్లి విశాఖజిల్లా) 172. యల్లాప్రగడ లక్ష్మీనరసమాంబ (రేపల్లె గుంటూరుజిల్లా) 173. మన్నెపూరి సత్యనారాయణ (భీమవరం ప. గో. జిల్లా) 174. ఈయూరు రాజరాజేశ్వరి (అల్లూరు నెల్లూరుజిల్లా) 175. అక్కినేని గృహలక్ష్మి (మద్రాసు) 176. సయ్యదు అన్వారుద్దీన్ (ఏలూరు) 177. మల్లుల రామతులశమ్మ (రాజోలు తూ. గో. జిల్లా) 178. పాలకోడేటి గంగాప్రసాద్ (రాజమండ్రి) 179. తురగా సత్యసూర్యసుబ్బలక్ష్మి (భీమవరం ప. గో. జిల్లా) 180 మైతర రాజేశ్వర్ (నిజామాబాద్)



# సినిమా

## వార్తావరణం

లతాతో కలసి పాడననడంతో, మధుర గాయని ఆశాభోన్స్లే గతవారం ఏమంత వీనుల విందుగాని చర్చలలో, శ్రుతి మధురం కాని ఉదంతంలో హీరోయిన్ అయింది. కారకుడు ఆమె భర్త భోన్స్లే. బొంబాయిలోని ప్రసిద్ధ సంగీతదర్శకులంతా కలసి పై వారం ఒక ధర్మకార్యనిధికై పెద్ద ఎత్తున గానసభలు జరుప సంకల్పించారు. వాటిలో ప్లేబాక్ గాయకులూ, సంగీత దర్శకులూ, పాల్గొంటున్నారు. ఇందులో వచ్చి పాడవలసిందిగా ఆశాభోన్స్లేను కూడా ఆహ్వానించారు. లతా మంగేష్కర్ పాడేచోట ఆశావచ్చి పాడదని నిర్వాహకులకు ఉత్తరం రాశాడట. అది చూచి, సంగీత దర్శక సమితి కార్యదర్శి సలిల్ చౌదరి ఆమెకొక జవాబు వ్రాశారు. దానిమీద అధ్యక్షుడు ఎస్. డి. బర్మన్ సంతకం పెట్టారు.

### (ఆశా భోన్స్లే) భావం

“ఒకవేళ మీకూ మీకూ ఏ కారణంవల్లనైనా అభిప్రాయభేదాలు ఉన్నా, కళాకారులంతా కలసి తలపెట్టిన ఇలాటి సత్కార్యాలదగ్గిర అలాటి పట్టింపులు పెట్టుకోవడం తగదు. కాబట్టి మీరు తప్పక వచ్చి పాడాలి” అని బర్మన్ ఆ లేఖలో హితవుచెప్పి, ఆశా సహకారాన్ని అర్థించారట. అది అందగానే భోన్స్లేకి కోపం వచ్చిందనీ, ఆపైన ఆయన కారు మీద నేరుగా బర్మన్ బసకివెళ్ళి, ఆ సంగీత రస చక్రవర్తిని శ్రుతిమధురం కాని భాషలో కటువు మాటలలో దులిపేశాడని తెలుస్తూంది.

ఈ దాడికి తెల్లబోయిన బర్మన్ కోలుకునేలోగా భోన్స్లే సలీల్ చౌదరి ఇంటికివెళ్ళి ఆయన్ని కూడా మరాఠీభాషలో గట్టిగా కోప్పడి చక్కా వెళ్ళాడనీ, ఆయన చాలా చిన్నబుచ్చుకున్నాడని, తెలిసింది. ఇది తెలిసినమీదట మిగతా సంగీత దర్శకులూ, కళాకారులూ కూడా ఈ దుస్సంఘటనకి చాలా బాధపడ్డారు. నిజానికి ఈనాడు, సంగీతదర్శకులలో రెండుశాఖల లాటివి ఉన్నమాట నిజమే. ఒకటి ‘లతా’శ్రయం మరోటి ‘ఆశా’ వాదవర్గం. వీరు ఆమెనూ, వారు ఈమెనూ పాటుకు పిలవరని ప్రతీతి. ఈ సంఘటనతో ఒక్కసారి ఈ అతివాదులు కూడా ఏకమైపోయి ‘ఆశా’ చేసిన పని సబబుకాదని తీర్మానించుకున్నారట.

ఆశా భర్త భోన్స్లే గారికి, తన భార్య ఎక్కడ పాడాలో ఎక్కడ కూడదో నిర్ణయించే హక్కును ఎవరూ కాదనరు. అలాగే కోపం వచ్చినపుడు దాన్ని ప్రదర్శించే స్వేచ్ఛను వాడుకోవద్దనరు. ఎటొచ్చి, ఆ కోపాన్ని ఒరులమీద—ముఖ్యంగా గౌరవనీయులైన పెద్దలమీద చూపడం మటుకే ఏమంత అమోఘంగా ఉండదని అందరూ అంటున్నారు. అందులోను అవమానితులు ఇద్దరు ఒకప్పుడు ఆశా పైకిరావడానికి తోడ్పడి, హన్సరాజ్ బెహల్ దగ్గర తొలిసారిగా ఛాన్సు ఇప్పించినవాళ్ళు. కృతజ్ఞతమాట ఎలాఉన్నా ఇది మర్యాద కూడా కాదు. ఆశా వెంటనే ఈ కలవరాన్ని సర్దివేసి, సంగీత దర్శకుల సంఘానికి క్షమాపణలు చెప్పడం, అనవాళ్ళంతా ఏకమై ఆంక్ష విధించడంవంటి అవాంఛనీయ పర్యవసానాలను నివారించడం అందరికీ— ఆశాభోన్స్లే అభిమానులకుకూడా, ఆనందం కలిగిస్తుంది. రేపు (మే 16) ఉత్సవంలో పాడితే అంతా మరింత విని ఆనందిస్తారు.

—టచ్ స్టోన్

* * *

కొవ్వలి లక్ష్మీనరసింహారావుగారి నవల ‘సిపాయి కూతురు’ ఆధారంగా చందమామా ఫిలింస్ వారు తీస్తున్న చిత్రం ‘సిపాయి కూతురు’ నిర్మాణం పూర్తికావచ్చింది



నేషనల్ ప్రొడక్షన్స్ వారి ‘గొప్పింటి అమ్మాయి’లో పద్మిని

# చిత్రలేఖలు



'రేచుక్క, పగటిచుక్క' లో
ఎన్. టి. రామారావు

## వార్తావరణం

త్వరలో విడుదలకు సన్నాహాలు చేస్తున్నారు. ఇంగులో సిపాయి గుమ్మడి, కూతురు జమున సత్యనారాయణ అనే కొత్త నటుడిని మరొక ప్రముఖపాత్ర ద్వారా పరిచయం చేస్తున్నారు. దర్శకుడు పి. చెంగయ్య సంగీత దర్శకుడు సుబ్రహ్మణ్యంరాజా నిర్మాత డి. ఎల్. నారాయణ

## కూతురు కాపురం

విశ్వరూపా వారి సాంఘికం 'కూతురు కాపురం' పై వారం విడుదల కాగలదని తెలుస్తోంది జమున, జగ్గయ్య నాయికా నాయకులు దర్శకుడు శోభనరావు, సంగీత దర్శకుడు రమేష్‌నాయుడు నిర్మాత శేషగిరిరావు

## సువర్ణ సుందరి

అంజలీ పిక్చర్స్‌వారి హిందీ 'సువర్ణ సుందరి' కూడా రజతోత్సవాలు జరుపు

### ద్రోహదం

సినిమాలవల్ల సంగీతానికి చాలా ద్రోహదం జరిగిందని నా నమ్మకం హండ్రెడ్ యార్డ్స్ డాష్‌లో పరిగెత్తేమనిషి, హైజంప్ చేస్తున్న మనిషి చక్కని ప్రేమగీతం పాడటం లోగడ సాధ్యం కాని పనుల్లో ఒకటిగా ఉండేది అలాంటిది ఇప్పుడే సినిమాలో చూసినా హీరో కాలుకాలిన పిల్లికంటే ఎత్తుగా ఎగిరెగిరి పడుతూనూ, హీరోయిను అత్యద్భుతమైన వేగంతో డాన్సు చేస్తూనూ, తాళం తప్పకుండా, కూర్చుని పాడుతున్నంత హాయిగా, పాడటం గర్వించదగిన విషయం ఒకప్పుడు తెలుగు కవదాసులో బాగా తాగిన మనిషి 'జగమే మాయా' అని లయ తప్పకుండా కుండ బద్దలు కొట్టినట్టు పాడితే జనం ఆహా! ఏమి అతనిసామర్థ్యము 'డైరెక్టరెంత మేధావంతుడు' అని గుండెలు బాదుకున్నారు కాని ఇప్పటి సినిమాలలో మరింత క్లిష్టమైన పద్ధతిలో, అనగా పరిగెత్తుతూ, డాన్సుచేస్తూ, గంతులు వేస్తూ పాటలు పాడటం చూస్తే మన చలనచిత్రకళ నూత్న శిఖరాలంటుతుందని అనిపించక మానదు

ప్లేబాకింగ్ కాంగ్.

కొంది దేశవ్యాప్తంగా పల్లెలా పట్నాలా ఇలా బహుళ జనాదరణ పొందిన ఈ చిత్రంలో (హిందీ సహా) అంజలీదేవి నాగేశ్వరరావూ ముఖ్యపాత్రలు నిర్వహించగా నిర్మాత ఆదినారాయణరావు సమకూర్చిన సంగీతం కూడా ఉత్తరాదిన ప్రజాదరణ పొందింది దర్శకత్వం వేదాంతం రాఘవయ్య నిర్వహించారు గతవారం నాగపూర్‌లో రజతోత్సవాలకు వీరంతా వెళ్ళి అభినందన లందుకొని వచ్చారు

*

తమిళనాడులో విజయవంతంగా సాగిన పద్మినీ పిక్చర్స్‌వారి హాస్య ప్రధాన చిత్రం 'సబాష్ మీనా'ను, దర్శకుడు బి. ఆర్. పంతులు తెనిగించి 'సబాష్ పిల్లా' అను పేరుతో విడుదల చేస్తున్నారు శివాజీ గణేశన్, రంగారావు, చంద్రబాబు, కుసుమకుమారి, సరోజాదేవి నటించారు మాటలూ పాటలు శ్రీ శ్రీ వ్రాశారు

శ్రీకృష్ణసాయి ఫిలింస్ వారి 'గాంధారి గర్వభంగం' అనువాద కార్యక్రమం కూడా పూర్తికావచ్చింది సులోచన, మహిపాల్ మొదలగువారు నటించారు రచయిత శ్రీ శ్రీ

నిర్వహణ ఎర్రా అప్పారావు పాటల రికార్డింగు మొన్ననే పూర్తి అయింది త్వరలో నే విడుదల చేయాలనుకుంటున్నారు

### దొరలవాటు

ఆర్యా,

హాలీవుడ్‌కంటే మనవాళ్లు ఒక విషయంలో బాగా ముందుకు పోయినట్లు అనుమానంగా ఉంది నటుడికి, నటికి ఎంత వయస్సు ఉంటే అంత వయస్సే ఉన్న కారెక్టరు ఇచ్చి యాక్టుచేయించటం వాళ్ళ మామూలు మన సినిమాల్లో ఈ దొరలవాటు లేదు మన నటీనటులందరూ కారెక్టరాక్టర్లు కనక పాతికేళ్ళ వాడిచేత ముసలి వేషాలు వేయించటం, వయస్సు మళ్ళినట్లు కనబడే స్త్రీ స్టార్‌చేత పెళ్లిగు వేషాలు వేయించటం ఆనవాయితీగా ఉంటోంది మన నిర్మాతలు హాలీవుడ్‌ను అనుకరిస్తారని విమర్శకులు ఊరంతా అనుకుంటారు గాని ఈ ఒరిజినాలిటీని ఎవరూ మెచ్చుకోరేం?

'సర్వపాత్రధారి'

### కొత్తచొక్కా

ఆర్యా,

చాలకాలంనుండి ఒకే ఉంటున్న నా మే(ని)కప్పులో కొప్పులో ఇటీవల కొందరు కొన్ని మార్పులు చేసి లాల్చీ గల్లాతో పెట్టటంలో, గిట్టనివాళ్ళు నన్ను చూసి తెగ అసూయ పడిపోతున్నారట నారదుడికి చొక్కా యేమిటని విమర్శకులు వెక్కిరిస్తున్నారట నాకుమాత్రం సరదాలుండవా? నేను చొక్కా తొడుక్కోరాదని రూలుపాసైందా? ఇంతకీ, పిక్చర్లలో కొత్తదనం కావాలి మొర్రో అని వీళ్ళే గోల పెడతారుగదా ఇలా ఓపెననించి ఇలాటి మార్పులు చేస్తే హేళన చెయ్యటం తగునా?

—సినీనారదుడు.

### జరిగిన కథ

మొన్న మా వూళ్ళో పెద్ద దగా జరిగిపోయింది బాగా కాస్త చేశామనుకోండి కొత్త పిక్చరొచ్చింది పేరూ అదీ చూసి ద్రౌపది కథ అనుకున్నాం దానికి వెనిస్ ఫెస్టివల్లోనూ, ఇంకా ఎక్కడ పెడితే అక్కడా అద్భుతమైన అవార్డులూ వచ్చాయని విని గొప్పదనుకుని బెంగాలీ 'నాగేశ్వరరావు', బెంగాలీ 'రామారావు' 'రేలంగి' ఎలా వుంటారో, బెంగాలీ మ్యూజిక్కూ రాక్‌అండ్‌రోలూ ఎలా వుంటాయోగదా! టిక్కెట్లుకొని చూద్దుంగదా, నా రంగ ఏం చెప్పమన్నారు ఒకటే బోరు పిచ్చరు పెద్ద ప్లాపులెండి, ద్రౌపదిలేదు, భీముడు దుర్యోధనుడూ లేడు, డాన్సులు, ఫాంట్సులు అంతకన్న సరేసరి స్టోరీలో ప్రాగ్రెస లేదు చాలా దిగులుగా జిడ్డుగా ఉంది ఇ

## శ్రుతికీ అవతార్

సంగీత సార్వభౌముడు ఖాన్‌సాహెబ్ బడేగులాం అలీఖాఁ, సంగీత విద్యావతి లతామంగేష్కర్‌ను గతవారం ఒక గానసభలో అభినందించి దీవించాడు లతా తండ్రి, ప్రసిద్ధ మహారాష్ట్ర గాయకుడు కీ॥ శే॥ మాస్టర్ దినానాథ్ 17వ 'పుణ్యతిథి' సందర్భంగా గానసభ జరిగింది (వసూళ్లను లండన్‌లో తిలక్ స్మారకచిహ్న నిధికి విరాళం ఇచ్చారు) అక్కడ ఖాన్‌సాహెబ్ కూడా పాడారు లతా ఆరోజున శాస్త్రీయ సంగీతం పాడింది

ఇంతకుముందు ఒక సందర్భంలో ఎవరో ఖాన్‌సాహెబ్‌ను, లతా మంగేష్కర్ గానంపై అభిప్రాయం అడిగారు

# సంగీత రాగాలు

"ఓ శ్రుతి కీ అవతార్ హై ఓ శ్రుతి హై" అన్నాడట ఖాన్‌సాహెబ్

* * * *

లలితసంగీతప్రియులకు శ్రుతిపర్వమైన వార్త రాజేశ్వరరావు స్వయంగా పాడిన కొత్తపాటలు రెండు త్వరలో విడుదల కాబోతున్నాయి హెచ్ ఎం వి కంపెనీ తెలుగు రికార్డింగుశాఖ ముఖ్యనిర్వాహకుడు మంగపతిగారు గతవారం ఈ పాటలను రికార్డు చేయించారు ఈవార్తవిని సంగీతాభిమానులు చాలమంది హెచ్ ఎం వి రికార్డింగ్ రూముకువచ్చి రాజేశ్వరరావు పాటలో బీట్‌లు బీట్ చేస్తూ, ఫించుతూ ఆడుతూ పాడుతున్నట్లు పాడుతూ ఉండగా కనీ వినీ ఆనందించారు: రికార్డు త్వరలో విడుదల కాగలదు

* * *

ఈ నెల 16, 17 బొంబాయి నగర వాసులకు (బహుశా సిలోన్ రేడియో శ్రోతలకు) వీనులవిందు ఆ రెండు రోజులలో తొలిసారిగా చలనచిత్ర సంగీతోత్సవాలు జరుగుతాయి అగ్రశ్రేణి హిందీ సంగీత దర్శకులు 20 మంది - నౌషద్, శంకర్-జైకిషన్‌లు, అనిల్ బిశ్వాస్, సజ్జద్ హుసేన్, మదన్‌మోహన్, సలీల్ చౌదరి, ఖయ్యాం, వసంత్ దేశాయ్ ప్రభృతులంతా వల్లభ్‌భాయ్ పటేల్ స్టేడియంలో 100 వాద్యాల ఆర్కెస్ట్రాతో గానసభలు జరుపుతారు లత, రఫీ, ముఖేష్, తలత్, బహుశా ఆశా భోస్లే (వార్తావర్ణం చూడండి) మొదలుగు ప్రసిద్ధ నేపథ్యగాయకులంతా పాడుతారు.

'చార్ దిల్ చార్ రాహే' చిత్రానికి సంగీత దర్శకుడు అనిల్ బిశ్వాస్ గత వారం (బొంబాయిలో) విశ్వమానవసౌభ్రాతృత్వాన్ని ప్రతిపాదించే పాటను బృంద గానంగా రికార్డుచేశారు. ఆయన ముద్ర ఊన్నా, విశిష్టమైన, కొత్తదైన తరహాలో కైన ఆపాటను ఏడుగురు ముఖ్యగాయకులు— ముఖేష్, మన్నాడే, మీనాకపూర్, మెట్రో మర్ఫీ పోటీలో నెగ్గిన మహేంద్రకపూర్, ఆరతీముఖర్జీ పాడారు వీరుకాక మరి 20 మంది యువతీయువకులు కూడా పాడారు.

## 'నాటకరంగం'

ఆంధ్ర నాటకరంగస్థల ప్రగతి లక్ష్యంగా, రచయిత, సినీమాపత్రిక 'సినిమా' సంపాదకుడు అయిన శ్రీ ఇంటూరి వెంకటేశ్వరరావుగారు ఆరంభించిన పక్షపత్రిక "నాటకరంగం" తొలిసంచిక మా కార్యాలయం చేరింది

"ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ కార్యకలాపాల సమీక్ష, 'మన నాటకరంగం'పై మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి వ్యాసం వివిధపట్టణాలలో నాటకప్రదర్శనోత్సవాలపై వ్యాసాలూ, గతసంవత్సరం వెలువడిన నాటకాల, నాటికల వివరాలూ వార్తలూ మొదలగువాటితో పత్రిక ఆకర్షణీయంగా ఉంది ఆంధ్రలో రంగస్థల వికాసానికి దోహదంచేసే సంకల్పంతో ఈ పత్రికను ప్రారంభించిన ఇంటూరి వెంకటేశ్వరరావుగారు అభినందనీయులు

* * *

విఠల్ ప్రొడక్షన్స్‌వారి జానపదం 'జయవిజయ' ఐదోవారం సాగుతోంది కాంతారావు, రాజనాల, మిక్కిలినేని, బాలకృష్ణ, కృష్ణకుమారి నటించారు దర్శకుడు విఠలాచార్య

పెద్ద దగా అని వెంటనే లేచి నేనూ మా గాంగూ (ఓపాతిక దాకా ఉన్నాంలెండి) ఆ హాలు మానేజరు కాలరు పట్టుకుని డబ్బు ఇప్పించి పిచ్చరు ఆపించేశాం మళ్ళీ ఆడితే డొక్క చీరి డోలుకట్టించేస్తాం అని చెప్పి హడలగొట్టాం (తరవాత ఇంకో గాంగు వచ్చి, వందరూపాయిలిస్తాం ఒక్కసారి ఆ పిచ్చరు వేయించమని మా నేజరు కాళ్ళా వేళ్ళా పడ్డారుట (మానేజరు మమ్మల్ని తల్చుకుని, మళ్ళీ వేస్తే ఒట్టు) ఇంతకీ ఆ పిచ్చరు పేరు 'పథేర్ పాంచాలీ' లెండి అంతా దగా అసలా పేరే దగాకదూ? పాంచాలీ అంటే ద్రౌపది వాళ్ళ కథకదా అనిగదా మేమూ టోకరా తిన్నది ఇది నిజంగా జరిగిన కథ దీనికి తిరువాయిగా, ఇలాంటి పేర్లు పెట్టి అమాయిక ప్రజలను మోసం చెయ్యకుండా జవహర్‌లాల్ నెహ్రూగారు ఒక శాసనం చేయించాలి

ఒక సుబ్బారావు.

ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్‌వారి 'ఇల్లరికం'లో హేమలత, సి. ఎస్. ఆర్, జమున.





విజయవాడలో ఎయిర్ కూల్ సినిమా అలంకార్ థియేటర్‌కు శ్రీమతి అంజలీదేవి ప్రారంభోత్సవం జరిపారు. శ్రీమతీ కె. శ్రీనివాసరావు, నటీమణులు శ్రీమతులు అంజలీదేవి, సావిత్రి, జి వరలక్ష్మి, సూర్యకాంతం, రాజసులోచనలను ఈ చిత్రంలో చూడవచ్చు

# వీర భాస్కరుడు

సినీ దుష్టసింహులకు చివరి రీలులో చివాట్లూ, మరణశిక్షా తప్పదని మరోసారి హెచ్చరించడానికి అందమైన అడవులలో కొండలలో కోటలలో షికారు తీసుకెళ్ళే వరలక్ష్మి పిక్చర్స్‌వారి జానపదరథం 'వీరభాస్కరుడు' సాంప్రదాయికమైన సినీ పథంలోనే మనకి బాగా తెలిసిన మజిలీల మీదుగా సాఫీగా సాగిపోతుంది సారథి కడారు నాగభూషణంగారు, వినోద కాలక్షేపానికి లోటుగాకుండా, అడవులలో, కొండలలో, చూడదగిన కోటలసెట్‌లలో కథను ఆపి సాము గరిడీలూ, రకరకాల యుద్ధాలూ, డాన్సులూ అవీ చూపిస్తారు సంగీతం, హాస్యం మొదలైనవి కూడా సమృద్ధిగా సమకూర్చారు

ఈ వాక్యంలాగే, సముద్రాల జూనియర్, చురుకైన సంభాషణలన్నిటినీ యతిప్రాసానుప్రాసలమధ్య ఫోటోజెనిక్‌గా బిగించారు పాటలలో మాటవరసలు అందంగా ఉన్నాయి

ఒకరాజుమీద అతనితమ్ముడు విక్రమసేనుడు, ఇంకో అక్రమసేనుడితో కుట్రపన్ని, అన్నను, అతనిబలగాన్ని ఖర్చురాసేసి రాజ్యం కాజేస్తాడు మంత్రి తక్షణం మహారాణిని యువరాజునూ కోయగూడెం పంపేస్తాడు కోయదొర డైలాగూ గ్రాంథికంగా తొడుక్కున్న ఎవి సుబ్బారావు వారికి ఆశ్రయమిచ్చి యువరాజుని ఉదయకుమార్ సైజుకి పెంచుతాడు ముష్టియుద్ధం, కత్తియుద్ధం, కుస్తీపట్లు అవీ ఎన్నెన్నో నేర్పుతాడుగాని, కోయవాడు కాబట్టి సుష్ఠురమైన తెలుగు నేర్పలేకపోతాడు అయినా రాకుమారి వరలక్ష్మికి లేని పట్టింపు మనకేల యువరాజు భాస్కరుడు రెండుసార్లు ఆమె ప్రాణం కాపాడతాడు తరవాత, మంత్రి సలహామీద ఒక తీయని డ్యూయెట్ పాడతాడు మధురమైన పి బి శ్రీనివాయిస్‌తో స్వరలక్ష్మి వరలక్ష్మి కంఠం కలిసి పలికిన ఆ పాట ఈ చిత్రంలో బాగున్న రెండిటిలో ఒకటి శ్రమ ఇంకొంచెం విశాలంగా ఉంటే సినిమాస్కోపు తెరఅయితే ఈ పాట ఇంకా మధురంగా ఉండేదనిపించింది

రాకుమారి పరిచయంద్వారా భాస్కరుడు తన తండ్రి హత్యకు తోడ్పడిన అక్రమసేనుడి ఎదట పడతాడు ఆ వేషం వేసినది రేలంగికాబట్టి, ఆ రాజు పాడుపనిచేసినా, నిజంగా చాలా మంచివాడు అయినా పూర్తిగా దారికిరాడు ఎవరేం చెప్పినా 'అదీ నిజమే' అంటూ రేలంగి ఈ వేషంలో నేర్పుగా నెగ్గుకురాబోయాడు చివరకి మహామంత్రి అదృష్టం, కథ, కోయదొర అంతా కలసి భాస్కరుడి విజయానికి తోడ్పడడం, నాలుగైదు యుద్ధాలతో అతడు తిరిగి రాజ్యం సంపాదించడం జరుగుతుంది గుప్తుడుగా రాజనాల, రెండో రీలులో పోర్షను అయిపోయిన రాజుగా మిక్కిలినేని, మంత్రిగా శర్మ, బాలకృష్ణ, పేకేటి శివరాం రాజనందినిలో జి వరలక్ష్మిగా సూర్యకళ, ఛాయాదేవి, మొదలగువారంతా యథోచితంగా నటించారు. అందరిలోనూ అగ్రతాంబూలం కన్నాంబకే లభిస్తుంది ఎంత పాతరకం వేషం వేసినా సౌలభ్యంతో ఒప్పించగల నటి ఆమె

సాలూరి హనుమంతరావుగారి సంగీతం బాగున్నా, ఇందులో స్వయంగా విన్నా నమ్మకం కుదరని అంశాలు రెండున్నాయి ఒకటి వరలక్ష్మిపాట ఆశించినంత అద్భుతంగా ఉండక పోవడం అలాగే శాస్త్రీయ సంగీత సభలుచేసే లీల పాడిన జావళీ కూడ నిర్దుష్టంగా ఉందనిపించకపోవడం బహుశా తెరమీద వరలక్ష్మి, సూర్యకళ నృత్యాలు చేస్తూ వీటిని పాడడమే కారణమేమోనని ఒక సంగీత ప్రియుడు చమత్కరించబోయాడు అందుకు నిదర్శనంగా, వరలక్ష్మి, సూర్యకళ స్త్రీమితంగా కూర్చుని వీణలు వాయిస్తూ పాడిన కీర్తన వీనుల విందుగా ఉంది మొత్తంమీద ఒకటి రెండు అనుకరణలున్నా, వినసొంపైన సంగీతం వినిపించిన హనుమంతరావు అభినందనీయుడు.

## సినీప్రేక్షక సభ

ఏప్రిల్ 12 నుండి 14 వరకు రాజమండ్రిలో జరిగిన ఆంధ్రప్రదేశ్ సినిమా ప్రేక్షక మహాసభల సందర్భంగా, ఆహ్వాన సంఘంవారు ప్రత్యేక సంచికను ప్రచురించారు 1958 వ సంవత్సరపు తెలుగు చిత్రాలపై వీరు నిర్వహించిన బాలట్ ... రాలూ, ఎన్నికఅయిన కళాకారులందరి చిత్రాలూ పొందుపరుస్తూ ఈ సంచికను ఆకర్షణీయంగా రూపొందించారు తెలుగు చిత్రపరిశ్రమ సంగ్రహచరిత్ర, తొలి తెలుగు టాకీ నిర్మాతా చలనచిత్ర పితామహుడూ అయిన హెచ్ ఎం రెడ్డిగారి "మూడు పదుల ముచ్చట", సినిమాలో కళాకారుని బాధ్యతలపై అక్కినేని నాగేశ్వరరావు చర్చ, హాస్యంపై రేలంగి వెంకటరామయ్య ప్రేక్షక సంఘాలపై కర్రె నాగభూషణం, ప్రేక్షకులపై ఇంటూరి వెంకటేశ్వరరావు వ్రాసిన వ్యాసాలూ ఉన్నాయి

"ఆంధ్ర ప్రేక్షకునకు అనిసెట్టి (సుబ్బారావు) సమర్పించు సన్మానపత్రము" ఈ సంచికకు అలంకారప్రాయంగా ఉంది మంచి చిత్రాలు తీయాలన్న మంచిమాటను 'చూసేవారు' చెబుతేనే తీసేవారు శ్రద్ధగా వింటారు కాబట్టి ఈ చూసేవారంతా కలసి కూడబలుక్కుని మంచిచెడ్డలు నిర్ణయించి, మంచిలక్షణాలుగల చిత్రాలనే ఆదరిస్తే, ఈనాడు అందరూ చెడ్డవనుకునే ధోరణులు త్వరగా పోతాయి ఆంధ్ర ప్రేక్షకులు ఈ విషయాలు ఆలోచించి ఊరూరా కట్టుదిట్టమైన పద్ధతులలో సంఘాలు కట్టి ఈ లక్ష్యం సాధించడానికి దోహదం చేయవచ్చును, బలమైన సంఘాలు ఏర్పరచుకొన్ననాడు, ఇతర రాష్ట్రాలనుండి ఇతర దేశాలనుండి ఉత్తమశ్రేణి చిత్రాలను తెప్పించి చూచే సదుపాయాలుకూడా చేసుకోవచ్చును ★

# కల్ హమారా హై

కై. అమర్ నాథ్ కొత్త చిత్రం 'కల్ హమారా హై', బాక్సాఫీసు కోటలో పాగా వేస్తుందో లేదో గట్టిగా చెప్పలేము. బహుశా డిస్ట్రిబ్యూటర్ల పెట్టుబడిదారుల అంచనాల స్థాయికి దిగకపోవచ్చు. దిగినా దిగకపోయినా, చలన చిత్రంగా అది అపూర్వమైనదని చెప్పుకోవాలి. చైతన్య స్ఫూర్తియుతమైన కథ, కథ వంగల ఈ చిత్రానికి రచన దర్శకత్వం ఎస్. ప్రభాకర్ నిర్వహించాడు. చిత్రంలో దృశ్య-చిత్రణ, దానికి అనుకూలంగా శబ్దాన్ని వినియోగించుకొన్న శిల్పం, మాటలమీద చెప్పినకథ అపూర్వంగా ఉన్నాయి. ఇంతవరకూ వచ్చిన ఏ చిత్రంలోనూ లేని పనివాడితనం కనబడదు. ప్రతి సన్నివేశంలోను నిండుతనం, కనుల విందైన దృశ్యాలతోపాటు కనబడని భావం ఉన్నాయి. అక్కడక్కడ రెండు మూడు సందర్భాలలో మటుకు దర్శకుడికి కథమీద పట్టు సడలినట్టు కనిపిస్తుంది. ఆ సమయాలలో అనవసరమైన పాత్రలు ఒకటి రెండిటిని ప్రవేశపెట్టి కప్పుకు రావాలని చూశారు. అలాగే ఉత్తరార్ధానికి వచ్చే సరికి,—చిత్రం ఆరంభంలో కనిపించిన అద్భుతమైన సన్నివేశాలు కలిగించే ఆశలకు విరుద్ధమైన రీతిన కొన్ని సేలబారు ఉపాయాలకు వడిగట్టవలసి వచ్చింది.

ఈలోపాలు ఉన్నా "కల్ హమారా హై" చాలా మంచి చిత్రం. రెండోసారి చూస్తున్నపుడు ఇందులో మెలకువలు పనివాడితనం మరింతగా కనిపించి అలరిస్తాయి. ప్రభాకర్ దర్శకత్వం నిర్వహించడంతో పాటు, కండపుష్టి, అర్థపుష్టిగల సంభాషణలుకూడా వ్రాశారు. కొద్ది మాటలలో కథావస్తువును హృదయంగమంగా చెప్పగలిగారు.

నటనకూడా ప్రశంసనీయమైన స్థాయిలో ఉంది. అగ్రతాంబూలం, పెట్టుబడిదారు భూమికను నిర్వహించిన జయంత్ ది. ఎన్నతగ్గ సహజత్వంతో, సౌలభ్యం వుట్టిపడేలా ఆయన ఆపాత్రకు నడిపాడు. మధుబాల, ఇందులో రెండు వేషాలు వేసింది నటన దృష్ట్యా రెండూ పరస్పరం ప్రతికూలమైనవి. రెంటిలోను మధుబాల, బీదపిల్లగా కన్నా, సీనుకోసారి చీరమార్చే సొసైటీ చిలకగా ఎక్కువ రాణించింది. ఆమె చక్కని విగ్రహాన్ని, అందమైన దుస్తులలో మనోహరంగా ఫోటోగ్రాఫ్ చేశారు. హీరో పాత్రధారి భరత్ భూషణ్, పోకిరీగా తిరిగి తిరిగి, దరిమిలా ఆదర్శవాదిగా మారిపోయిన యువకుడి పాత్రను భరత్ సమర్థంగా నటించాడు.

ఈ చిత్రంలో సంగీతం కథకు ఉపశ్రుతి వంటిదేతప్ప, ఇతర చిత్రాలలోవలె సమాన ప్రాధాన్యం లేదు. ఉన్న పాటలుకూడా కథకు అడ్డుపడకుండా అందంగా అమరాయి. ఉన్న పాటలన్నీ బాగున్నాయనిపించాయి. కథావస్తువును ఉద్ఘోషించేపాట చాలారోజులు మనసులో మెదలుతూనే ఉంటుంది. మధుబాల, జీవన్ లేఖ, శీలాకాశ్మీరీల నృత్యాలకు ఆలంబనాలైన మరిమూడుపాటలుకూడా శ్రుతిమధురంగా ఉన్నాయి. సంగీతరచయిత చిత్రగుప్త అభినందనీయుడు. బి. ఎన్. గంగూలీ ఛాయాగ్రహణం చిత్రానికి వన్నె తెచ్చింది. తప్పకుండా చూడవలసిన చిత్రం.

—టచ్ స్టోన్.

(10-వ పేజీ తరువాయి)

కుని ఉన్నాడు.

"ఏడ్చినట్లేఉంది నీతెలివి!" దోమతెర తొలగించుకుని కుర్చీ మీద కూర్చుంటు కామెంట్ చేశాడు.

"ఇవ్వాళ ట్యూషనుకు పోవా?"

"ఏ మొహంపెట్టుకుని పొమ్మంటావ్?"

"అదే నేనూ అనబోతున్నాను. ఇక పోవద్దు వాళ్లింటికి నే నొకటి అడుగుతాను నిర్మొహమాటంగా చెప్పాలి."

"అడుగు: మంత్రసాని తనానికి ఒప్పు కున్నతర్వాత తప్పేదేముంది?"

"నువ్వు సంధ్యను ప్రేమిస్తున్నావా?"

"ఆ విషయం మీ చెల్లాయినడుగు..."

"అయితే ఇంకేం?"

"కాని ఆ ముసలాయన..."

"అది నేను చూస్తానుగా...మంత్రసాని తనానికి ఒప్పుకుంటానిగా..."

* * *

మూర్తి సుందరంగారింటికి పోయేసరికి ఆయన పచార్లు చేస్తున్నారు. కోపం, విసుగూ సమపాళ్ళలో కల్సి మొహంలో భయంకరమైన ఛాయలు సృష్టించాయి.

"ఏడోయ్, మీ మిత్రుడు ప్రభాకరం? ఈ రోజు ప్రయివేటు చెప్టానికి రాలేదేం?"

"రాలేదండి... కాలేజీలో గొడవ చేస్తున్నారట."

"అవును. విన్నాను. మనమ్మాయీ చెప్పింది. ఒకటే ఏడ్పు అది- కాలేజీనుంచి వచ్చినప్పటినుంచి మనవాళ్ళు ఉత్త తెలివి తక్కువ వాళ్ళు, కుసంస్కారులూ నోయ్. లేకపోతే ఏమిటూ చెప్పు ఈ గొడవ?"

మూర్తిమనసు కొంచెం కుదుటబడింది. ఆయన కోపమూ, విసుగూ ప్రభాకరం, సంధ్యలమీదకాదు, 'కుసంస్కారుల' మీద.

"మన సంప్రదాయం అటువంటిది, దానికి మనమేం చేస్తాం చెప్పండి. పెళ్ళికాని యువకుడూ, పెళ్ళికాని యువతి మాటాడుకున్నా తప్పుగా ఎంచుతారు."

"కాలాన్నిబట్టి సంప్రదాయాలూ, ఆచారాలుకూడా మారాలి. వెనక ఇలా కాలేజీ చదువులులేవు కాబట్టి ఆడపిల్లలు బయటికి వెళ్ళేవారుకాదు. పరాయి మగవాళ్ళతో మాటాడాల్సిన అవసరమూ ఉండేదికాదు. కాని ఇప్పుడెలా కుదురుతుంది? ఆడవాళ్ళు కూడా ఈరోజుల్లో కాలేజీ చదువులు చదువుతున్నారాయె ఉద్యోగాలు చేస్తున్నారాయె. అలాంటప్పుడు మగవాళ్ళతో మాటాడకుండా, కలవకుండా ఎలా కాలం గడుస్తుంది?"

"మీ రనేది నిజమే ననుకోండి. లోకానికి ఎదురీదలేముకదండి. ప్రభాకరం ఇక రానంటున్నాడండి. తలవంపులుగా ఉందిట. మిమ్మల్ని చూడటానికి మొహం చెల్లటంలేదుట."

"మరీ అంతమంచితనం పనికిరాదోయ్ అతనికి. అతనేం తప్పుచేశాడని నా మొహం చూడలేకపోవటానికి? అతన్ని నేను కనిపెట్టూనే ఉన్నాను. చాలా మంచివాడోయ్. ఎలాగు అతను రాకపోతే మరి! పరీక్షలుకూడా దగ్గరలోకి వస్తున్నాయి."

"అదే నేనూ ఆలోచిస్తున్నానండి. ఇది వరకు చదివిందంతా ఒకఎత్తు. ఈ నెలా పది హేనురోజులు చదివింది ఒకఎత్తు."

"అదేనోయ్. ఇప్పుడా ట్యూషనుమానితే అమ్మాయి ఎందుకూ పనికిరాదు. క్లాసుమాట అలాఉంచి కనీసం ప్యాసుకూడా కాదు. ఫలానావారమ్మాయి ఇంటర్మీడియట్ తప్పిందంటే ఎంత తలవంపులు! రేపు క్లబ్బులో తలఎలా ఎత్తాం?"



# పుస్తక సమీక్ష

## త్రిశంకుని నరకం

["త్రిశంకుస్వర్గం" (నాటిక) రచన: విడియాల చంద్రశేఖరరావు; ప్రచురణ: కవితా పబ్లికేషన్స్, బీసెంటురోడ్డు, విజయవాడ 2. క్రౌన్ సైజులో 44 పేజీలు. వెల 70 న. పై.]

ఒకానొక మధ్యతరగతి కుటుంబీకుడయిన రామమూర్తి గుమాస్తా వుద్యోగం చేస్తున్నాడు. సహధర్మచారిణి పద్మ—ఇంట్లో పిల్లలూ వుంటారు. మధ్యతరగతి గుమస్తా లందరిలాగే రామమూర్తి కష్టాలు పడుతూ వుంటాడు—జీతంచాలక. అప్పులవాళ్లు రావటాలూ, పిల్లలు స్కూలుజీతాలు అడగటాలూ—లాంటి సంఘటనలు జరుగుతూ వుంటాయి. ఆఖరికి ఈ నాటిక రచయిత 'శివరాం' అనేపాత్రరూపంలో రంగం మీది కొచ్చి, "భార్యకూడా భర్తతో పాటు ఉద్యోగంచెయ్యాలి, అప్పుడే సంసారాలు బాగుపడతా యని ఒక దివ్యసందేశాన్ని ఉద్ఘాటించటంతో నాటిక ముగిసిపోతుంది."

ఆచార్య ఆత్రేయ "గుమస్తా" అనే నాటకం రాశారు. ఈ నాటిక చదువుతూ వుంటే ఆ నాటకం గుర్తుకు వస్తుంది. ఆ నాటకంలోలాగే అప్పులవాళ్లు రావటం, ముష్టివాళ్లు రావటం, ఇతరసంఘటనలూ జరగటం వంటి ఈ నాటికలోనూ జరుగుతాయి. రామమూర్తి పాత్ర పెద్ద పెద్ద సంభాషణలు పలుకుతుంది. దేశం మీదా, ప్రభుత్వం మీదా, సమాజం మీదా విరుచుకుపడ్డాననుకుని డైలాగులతో తిడుతుంది! ఒకచోట అప్పులవాడు ఇంటికి రాగా—రామమూర్తి వెంటనే అతన్ని తిట్టేస్తాడు. "ఆరునెల్లయినా దగ్గర్నుంచి అప్పుతీసుకున్నావు. వడ్డీ అఖర్లేదు, ఆ అసలు పారేయించు" అంటాడు వడ్డీ వ్యాపారి న్యాయంగానే. కాని రామమూర్తి మంచి మర్యాదా లేకుండా మాట్లాడేసి "పశువులా ప్రవర్తిస్తున్నావు" అని కూడా అనేస్తాడు. ఇట్లా రామమూర్తిచేత అనిపించటంవల్ల వడ్డీ వ్యాపారుల మీద దెబ్బకొట్టానని రచయిత అనుకుంటే అనుకోవచ్చునేమో గాని—ఆ సమయంలో రామమూర్తి మీద ఎవరికీ సానుభూతి కలగదు సరికదా—అంత చొరవగా 'పేలి' నందుకు కోపం కూడా వస్తుంది! సంభాషణల్లో చాలాచోట్లకు సామెతలూ, తనకు తెలిసిన సందేశాలూ కూడా వాడాడు రచయిత. ఇదంత మంచి పద్ధతి కాదు. నాటకాల్లోనూ నాటికల్లోనూ ఇందువల్ల నాటిక ప్రదర్శించే వాళ్ళకూ, ఆ ప్రదర్శన చూచేవాళ్ళకూ కూడా బాధగానే వుంటుంది. ఆఖరికి రామమూర్తి స్నేహితుడు శివరామ్ అతనికి "జ్ఞానోపదేశం" చెయ్యటం కూడా అసహజంగానే వుంది. ఇంట్లో భార్య కూడా వుద్యోగం చేస్తే, గృహపరిశ్రమలుచేస్తే సంసారానికి రాళ్లు సంపాయించాలని చెప్పగానే, రామమూర్తి ఎగిరి గంతేయటం అంతకన్నా అసహజంగా వుంది. వెంటనే భార్య దగ్గరకు వెళ్ళి "ఇన్నాళ్లూ నరకం అనుభవించినవాళ్లమే ఇప్పుడు స్వర్గాన్ని (త్రిశంకు కాదు) అనుభవిద్దాం. గడ్డురోజులుపోయి మంచిరోజులు దాపురించాయి" అంటాడు. వాళ్ళకు మంచి రోజులు దాపురించాయో లేదో కాని—ఈ నాటిక చదివాక మనకు 'త్రిశంకుస్వర్గం' దాపురిస్తుంది.

'ఆర్కే'.

---

# ఇల్లు కాదు..ఇల్లాలు

"మీరు కోప్పడకండా ఉంటే ఒకమాట చెప్తాను. సంధ్యకీ ఇష్టమే ప్రభాకరమంటే."

ఆపైన మాట్లాడటానికి ధైర్యం చాలలేదు మూర్తికి.

సుందరంగారి మొహంలో అవమానం కోపం తాలూకు ఛాయలు ఒక్కసారి శ్రావణమేఘాల్లా పరుచుకున్నాయి.

"ఏమిటోయ్, నువ్వనేది మనమ్మాయిని అతని కియ్యమంటావా?"

"ఆలోచించి చూడండి. అంతకన్న వేరే ఉపాయం కన్పించటంలేదు."

"ఫారిన్ రిటర్న్‌డ్‌ని తీసికొచ్చి చేస్తాను. ఏమిటనుకొన్నావో?"

"కాని ఊరంతా గుప్పుమ్మని పోతున్నది. ఎవరి నోటవెంటచూసినా వీళ్ళిద్దరి పేర్లే. ఎవరు ధైర్యంచేసి చేసుకొంటారు?"

"అతని ఆస్తిపాస్తులేమిటో మనకు తెలీయవు కదా?"

"మన అంతస్తుకేమీ తీసిపోయిన గాళ్లు కాదండీ వారు. పెళ్ళి జ్యేష్ఠమాసంలో చేసినా, ఖాయమనుకుంటే ఎవరూ నోరెత్తలేరు."

సంధ్యను పిలిపించి అడిగారు. సిగ్గుపడింది చెప్పటానికి. ప్రభాకరం గదికిపోయి అడిగారు—సన్నగా నవ్వి ఊరుకున్నాడు.

ఆమర్నాడు ప్రభాకరం పాఠం చెప్తున్నాడు. సంధ్య ఊహూ సిగ్గుపడుతోంది. పెళ్ళి కూతుర్లా తలవంచుకు కూర్చుంది.

"ఎందుకంత సిగ్గు? ఇంకా ఆ మూడు ముళ్ళూ పడలేదుగా?" చుబుకం పట్టుకు మొహం పైకి ఎత్తుతూ అన్నాడు ప్రభాకరం.

సోగ్గా చూస్తూ—"ఆ మూడు ముళ్ళూ పడితే ఈ ఫిజిక్స్ పాఠం ఎందుకు?" అంది సంధ్య.

"అవునవును. అప్పుడు నువ్వే నాకు కొత్త పాఠాలు నేర్పుతావ్?"

"పొండి మీరు మరీను. ఎందుకా మీరు నాకు ట్యూషను చెప్తానన్నది? ఏమో అనుకున్నాను—భలె తెలివయిన వాళ్ళేనండీ మీరు!"

"ఇందుకోసమేం కాదు; మీ ఇంటా కోసం" అని అందామనుకుంటూండగా సుందరంగారు ఏదో ఎక్స్‌ప్రెస్ లెటరు తీసుకుని మేడమీదికి వచ్చారు.

"ఇదిగో చూడమ్మాయ్! మనవాడిని మళ్ళీ బెజవాడ వేశారుట. రేపు బయల్దేరి వస్తున్నాడు. ఇంకా నయం మనమీ మేడ ఎవరికీ అద్దెకియ్య లేదు?"

ప్రభాకరానికి ముచ్చెమటలు పోశాయి. పరుగెత్తాడు మూర్తి దగ్గరకు. మూర్తి టాయిలెట్ అయి ఎక్కడికో పోబోతున్నాడు.

"నీ తెలివంతా బూడిదలోపోసిన పన్నీరయింది! అసలు విషయం చెప్పావు; నోరు తెరిచాడు మూర్తి.

* * *

ప్రభాకరానికి తన కూతుర్నిస్తానని వచ్చిన రామమూర్తిని వెంటబెట్టుకుని బెజవాడ బయల్దేరబోతున్న రామనాథంగారికి పోస్ట్‌మాన్ ఒక ఉత్తరం ఇచ్చిపోయాడు.

"ఇల్లుకూడా మంచిది ఒకటి చూసిరండి పెళ్ళి అవగానే కాపురం పెట్టించవచ్చు." అన్న భార్య మాట ఒక చెవితో వింటూ ఉత్తరం చదవసాగారు.

పూర్తిగా చదివి క్రింద తలకిలపడిపోయారు.

భార్యా, రామమూర్తీ ఆశ్చర్యంగా ఆయనవంక చూస్తున్నారు.

"ఏమిటండి? అది?"

"ఇంక మనం బెజవాడ పోనవసరం లేదండి. మావాడు వ్రాసిండీ ఈ ఉత్తరం. ఇల్లు ఇంకా దొరక లేదుటగాని ఇల్లాలు దొరికిందిట. గొప్ప ఘనకార్యమే సాధించాడు."



Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1 Editor S. Sambhu Prasad

